# ఆంధ్రసచిత్ర వారపత్రిక



ANDHRA SACHITRA VARA PATRIKA

20-7-60 25 న.పై



ఎగరబోత
ఫోటో—శ్రీ కె. ఎస్. వి. ప్రసాద్. (ముమ్మిడివరం)


కోడియుద్ధం తర్వాత
గెలుపు నాదే - ఇంక మనం ఇద్దరం ఒకటే
సంజీవయ్య
రెడ్డి


'భాయీ, మన కొత్త రాజ్యాంగ చట్టం గురించి నీ అభిప్రాయం ఏమిటి? ఏం మాట్లాడవ్?... అంటే నీకు పూర్తిగా ఇష్టమనేగా బహుత్ అచ్ఛా!'
అయూబ్ ఖాన్


57
అంచనా
ఇంకా గెలుపు ఎక్కడిది?



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## పుట్టుట గిట్టుట కొరకే

హిందువుల పెళ్ళిళ్ళు, ఐరిష్ వారి చావులు ప్రపంచం మొత్తమ్మీద విపరీతమైనఖర్చుతో కూడుకున్న కార్యక్రమాలని వినికిడి. హిందువులు ఇప్పుడు చౌకగానే పెళ్లి చేసుకుంటున్నారు. అయితే ఐరిష్ వాళ్ళు చౌకగా చచ్చిపోతున్నారో లేదో రూఢిగా తెలియదు.

పుట్టుట గిట్టుటకొరకే అన్నప్పుడు, గిట్టుబాటు ఐనా కాకపోయినా గిట్టడం తప్పదు మనుష్యులకు. డాక్టరు డబ్బు ఎక్కువవదిగాడని చెప్పి, 'ఈ వేళ చావను; రేపు' అని లేచికూచోడం పోయేకాలపు లక్షణం కాదు; బుద్ధిమంతుల లక్షణం కూడా కాదు. ఐర్లెండులో కూడా చచ్చిపోవడం ఏమంత ఘనకార్యం కాదుట. ఖననసంస్కారానికి ఖర్చుపెడతారట డబ్బు ఎక్కువగా.

ప్రపంచంలో జనాభా పెరిగిపోయిన కొద్దీ ఒక కొత్త నినాదాన్ని ప్రభుత్వాలు అమలులోకి తెస్తున్నాయి. అది: 'పుట్టడం కష్టం చెయ్యి; చావడం సులభం చెయ్యి'-అన్నది. పల్లెల్లో ఆసుపత్రులు లేకుండా చేయడం; ఉంటే-మందులు లేకుండా చేయడం; ఉంటే-డాక్టర్లు లేకుండా చేయడం-ఈ నినాదాన్ని నిజం చెయ్యడంలో భాగాలేనట. నగరంలో ట్రాఫిక్ కంట్రోల్ కూడా కొంచెం అటూ ఇటూగా దీనికి సహాయపడానికే.

ఇటువంటిదే కొంచెం తేడాగా 'పెళ్లి కష్టం చెయ్యి; విడాకులు సులభం చెయ్యి' అనే నినాదం. పూర్వం పెళ్లిళ్లు మహోత్సవంగా జరిగేవి. అంబలి త్రాగేవారు కూడా ఒకటో రకం సంపంగి నూనె మీసాలకు రాసుకుని కూచునేవారు పెళ్లిపందిళ్ళలో. మీసాలంటే మీసాలా? 'మెలిపెట్టి విడిచిన మీసాలపై గొప్ప నిమ్మకాయలు రెండు నిలుపవచ్చు' అని పద్యాలు రాయించ గల్గిన మీసాలు!

సంపంగినూనె ఖరీదెక్కువ కావడంతో మీసాలు తరిగి బారెడు మూరెడయ్యాయి; మూరెడు జానెడయ్యాయి; కుదుస్తూ కుదుస్తూ మాయమయ్యాయి. ఐదురోజుల పెళ్ళిళ్ళు సంకోచించి మూడురోజుల వయ్యాయి; ఒకే రోజు పెళ్లిళ్లుగా మారాయి. దండ వేయించి, ఉంగరాలు మార్పించారు కొంత కాలం: బంగారంధర పెరగడంవల్ల ఇప్పుడు దండలు మాత్రం వేయిస్తున్నారు.

ఇప్పుడు పెళ్లి అంటే అలకపాన్పు అనేది పబ్లిగ్గా ఏర్పాటుచేసి ప్రైవేటుగా ఎగ్గొట్టడం; కట్నం పబ్లిగ్గా ఏమీ లేదని ప్రైవేటుగా ఇచ్చుకోవడం-ఇంతటికే పరిమితం అయిపోయింది.

### ఇల్లుకట్టి చూడు:

కనుక-'ఇల్లుకట్టి చూడు, పెళ్ళి చేసి చూడు' అన్న తెలుగు సామెతలో సగం ఎందుకూ కొరగాకుండా పోయింది. ఇక మిగిలింది సామెతలో మిగిలిన సగం మాత్రమే.

1956 లో హైదరాబాదు రాజధానిగా ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిననాటినుంచి జనాభా విపరీతంగా పెరిగిపోయింది. విమానాలు రాకపోయినా, రైళ్లు ఆలస్యంగా వచ్చినా జనం వరదలా ప్రవహిస్తున్నారు నగరంలోనికి. వెనక్కు తిరిగి చూడకుండా ఇళ్లు కట్టేస్తున్నారు ప్రజ.

ఇళ్లు కట్టుకున్నప్పుడు సహజంగానే నగర పాలక సంఘం అనుమతి కోరవలసి వస్తుంది. ప్లానులుచూపి ఓకేనిపించుకోవలసి వస్తుంది. ఈ సందర్భాలలో నపాలక సంఘోద్యోగులు సరదాగా చేసిన పనులు: (1) ప్లానుకు అభ్యంతరం లేకపోయినా, చెప్పడం: జేబులు నింపుకోడం. (2) అభ్యంతరం ఉన్నా, జేబులు నింపుకోడం, చెప్పకపోడం. ఈ రెండో సందర్భంలో ప్రమాదం సంభవిస్తే, (2 ఎ) కట్టిన ఇల్లు, గోడ పడగొట్టేయమనడం. (2 బి) కట్టుకున్నవాడు బలవంతుడైతే, నిశ్శబ్దంగా ఊరుకుని బలహీనుడిపై విరుచుకుపడడం.

నపాలక సంఘోద్యోగులు చెయ్యనిపని: కొత్తగా ఏర్పడిన కాలనీలకు కనీస సౌకర్యాలు కల్పించడం. విజయనగరంలో న్యాయవాదులు, అధ్యాపకులు, విద్యావంతులైన పౌరులు చాలామంది ఉంటారు. ఈ కాలనీ లేచి మూడున్నర సంవత్సరాలు కావస్తూంది. ఇండ్లకు దీపాలు వచ్చాయి; టెలిఫోనులు కూడా వచ్చాయి. కాని వీధులన్నీ ఇంకా దీపాలకోసం కంచు కాగడాతో వెతుక్కోవాలి. చాలా ఇళ్ళవాళ్లు ఇంకా నీటికోసం వీధిలో ఉన్న 'నల్లా' [పాఠాంతరాలు: పైపు, పంపు, కొళాయి.]ల వద్ద క్యూలో నిలబడాలి. ఇది ఉదాహరణ మాత్రమే.

పునర్జన్మించిన కుంభకర్ణుడుగా నపాలక సంఘాన్ని అభివర్ణించి ధన్యులయ్యాం మనం ఇదివరకే. 'ఈ బిరుదుకు అర్హత నాది' అని ఆంధ్ర ప్రదేశ్ న్యాయస్థానంలో 'రిట్' వేసేటి హక్కు గలిగిన సంస్థ హైదరాబాదులో ఉంటే అది 'సి. ఐ. బి.'. 'సి. ఐ. బి.' అంటే సిటీ ఇంప్రూవ్ మెంట్ బోర్డు అని. ఈ సంస్థకు ఇప్పుడు బారెడు కళ్లు. జూన్ 30 వ తేదీ రాత్రి పన్నెండు గంటలకు అపకీర్తి శేషురాలైంది. బ్రతికున్న రోజుల్లో 'ఇంప్రూవ్ మెంట్' అన్న పదం నోరారా పలకలేని సంస్థగా బ్రతికుండేది ఈ సంస్థ. ఈ సంస్థకు దాదాపు పెద్ద చెల్లెలు సికిందరాబాదులోని 'టౌన్ ఇంప్రూవ్ మెంటు ట్రస్టు.'

కీ సామర్థ్యాల విషయంలో ఈ రెండింటిలో ఏది పెద్దదో ఏది చిన్నదో కనుక్కోడం ఎవరి తరమూ కాదు.

మచ్చుకు చూడండి: మల్లేపల్లిలోనూ మరి కొన్ని చోట్లా ఈ సీఐబీ నిర్మించిన ఇండ్ల కప్పులు లీకౌతున్నాయని ఫిర్యాదులు చేరాయట. చేరితే ఏమైందిట? నాలుగు ఇళ్ళ కప్పులు బాగు చేయించిందట సీఐబీ. బాగు చేయించిన ఈ నాలుగు కప్పులూ తీరుగా పని చేస్తున్నాయా లేదో చూసి, వర్షాకాలంలో వర్షం పడుతుందేమో చూసి, తదుపరి, వర్షాకాలం తర్వాత, మిగిలిన ఇళ్ళ కప్పులు బాగు చేయిస్తుందిట. ఇది అధికార పూర్వకమైన

# నూతనాతిథి

**జీ. రెడ్డి సావిత్రమ్మ**

నూతనాతిథి! యెందుండి ప్రీతి తోడ, వచ్చితివో, మాగృహంబునఁ బంతుగాను,
ఎందు మ్రాకులు ఫలతతి నెనఁగి నటులఁ బుట్టితివి, మా గృహస్థత పూర్ణతగను.

దేవకన్యవో, శ్రీ రమాదేవి వగుదో, వితత మాకు వన్మదీయ సుకృతివో యేమొ,
కన్నులకు భవ్యసాఫల్య గరిమగూర్చి, ప్రభవమైతివి సౌభాగ్యవదన వగుచు.

స్వర్గ భువనంబునే నీవు వదలినావొ? విబుధవాటికనే మఱి విడిచినావొ?
వరమ సౌభాగ్య కమనీయ విరహమేది, తలచి యేడ్వంగ నేర్తువో తనయ చెపుమ

కలుకు మే మహోజ్జ్వల భాగ్యవసుధ, నీదు భావమునఁదోచె మఱి యెందు వఱలుచుండు,
మాన్య దృశ్యము లేవేవి మదిని గలఁచి, నిన్ను రోదన చేయించెఁ జిన్ని బిడ్డ?

ఏదో తెలుపఁగఁ, బెదవులాడించి, మాదు భాష రాకయె నీ దివ్యభాష మాకుఁ,
తెలియదని యెంచెదో యేమొ, పలుక కుండ, మందహాసంబు నేతువు, సుందరముగ.

ఇవ్వ డిచ్చటి దృశ్యము లెల్లనీకు, మిగులఁ గ్రొంగ్రొత్త లగుచును నగడె నేమొ?
అందుచేతనె ప్రతివారి యాననంబు, కుతుకమునఁ జూచుచుందువా, కూతుఁగుఱ్ఱ?

ఈవు విడిన లోకాననిమఁడు తెలియఁ దారకలు, నిత్యరోచులఁ దనరుదుగదె?
మందశీతల పరిమళమహితుఁడగుచు, అనిలుఁ డవ్వేళ వీచుగాఁదనయ చెపుమ.

★ బహుమతి పొందిన గేయం ★

# కవితా కింకిణి

వార్త. ముఖ్య మంత్రి శ్రీ సంజీవయ్య శాసన సభలో సెలవిచ్చిన సంగతి.

సీతాఫల్ మండీలో లేచిన మొండి గోడలు, హైదరాబాదు ఇండస్ట్రియల్ ఏరియాలో చాలాకాలం మనుష్యులు లేకుండా, ఇప్పుడు సరియైన రక్షణ లేకుండా ఉన్న ఇళ్లు ఈ సీఐటీ, టీఐటీలచరిత్ర చెప్పక చెపుతాయ్-హంపీ శిథిలాలకుమల్లే.

ఈ రెండుసంస్థలు జూన్ 30 వ తేదీన కన్ను మూసుకున్నాయ్. జూలై ఒకటవ తేదీన హైదరాబాదు గృహనిర్మాణ మండలి ఏర్పడింది. శ్రీ ఎ. రాఘవరెడ్డి అధ్యక్షులుగా శ్రీయుతులు అచ్యుతరెడ్డి, మగ్దూం మొహియుద్దీన్, ఎస్. రామారావు, బాలా పర్షాద్ లు సభ్యులుగా. తెలంగాణాలో గృహనిర్మాణం కొత్తపద్ధతుల ప్రకారం సాగుతుందని ఆశించవచ్చు. హైదరాబాదు హౌసింగు చట్టాన్ని ఆంధ్రప్రాంతానికి పొడిగించినప్పుడు, ఈ గృహనిర్మాణ మండలి కార్యక్రమంకూడా విస్తృతం ఔతుంది.

## ఏ. శ్రీ రాఘవరెడ్డి?

**హైదరాబాదు గృహ నిర్మాణ** మండలికి అధ్యక్షులుగా శ్రీ రాఘవరెడ్డి నియమించబడ్డారని తెలిసినప్పుడు జనం 'ఏ శ్రీ రాఘవరెడ్డి?' అని ప్రశ్నించారు. తెలిసినవాళ్ళు అన్నారు 'శ్రీ ఏ. రాఘవరెడ్డే!' అని.

మదరాసులో సీఐటీ స్థాపించబడిన కాలంలో శ్రీ రాఘవరెడ్డి అధ్వర్యం క్రింద నడిచింది అది. పునాదులు అప్పుడేపడ్డాయి ఆసంస్థ చేసిన మంచిపనికి. మదరాసులో సీఐటీ పథకాన నివాసస్థలాలను ముందే తీసుకోగలడంవల్లనే తర్వాత నగరాభివృద్ధి సుకరమైంది. ఇప్పుడు శ్రీ రాఘవరెడ్డి ఎదుర్కొంటున్న పని క్లిష్టతరమైంది. హైదరాబాదులో ఉపయోగించతగిన భూమి చాలాఉంది కాని ఉపయోగంలోనికి తీసుకురాగల్గినది చాలా తక్కువ.

ఆయన ఇక్కడ ఎదుర్కొనవలసిన కష్టాలకు ఉదాహరణగా ఇప్పుడు "రవీంద్ర భారతి" నెలకొల్పనున్న స్థలం సంగతి చెప్పవచ్చు. టాగూరు శతవార్షిక వర్ధంతి 1961 మే నెలలో జరుపుతారట. మంచిది. ఆ నాటికి "రవీంద్రభారతి" పూర్తిచేస్తామన్నారు పెద్దలు. మరిమంచిది. శ్రీ గోపాలరెడ్డి పునాదిరాయి వేశారు. ఇంతకూ ఆస్థలం ఎవరిదట? ఎవరిదో తెలియదుట. ఇద్దరుముగ్గురు వ్యక్తులలో హక్కుదారులెవరో తేల్చాలట. అదిన్యాయస్థానాలు తేల్చాలి. తేల్చినతరువాత, ఓడిపోయిన వ్యక్తులు అప్పీలు చేసుకోకుండా ఉన్నతర్వాత, యజమానినుంచి భూమినితీసుకోడానికి ప్రభుత్వం చర్యతీసుకోవాలి. అది ఎప్పుడు తేలుతుందో ప్రభుత్వ వ్యవహారాలు సాధారణంగా చూసే భగవంతుడికే తెలియాలి.

ఇది అబద్ధమని ప్రభుత్వం ప్రకటించగల్గితే బాగుండును. ఫతేమైదాన్ పబ్లిక్ మైదానమని మనం భావించినా, దానివిషయంలో కూడా వాదోపవాదాలు ఉన్నాయని వినికిడి. ముస్లిమ్ లాలో వారసత్వాన్ని గురించి వచ్చే బెడదలు సాధారణంగా న్యాయస్థానాలు త్వరలో అంతం చెయ్యలేకపోవడం అందరూ గమనించిన విషయం. అందువల్ల విశాలమైన స్థలాలు కనబడుతూన్నా, అవి అందుబాటులో ఉంటాయనుకోడం కష్టం.

గృహనిర్మాణ మండలి ఎదుర్కొనవలసిన మరో ప్రధానమైన సమస్య ఉంది. సీఐటీ, టీఐటీ ఈ రెండింటి ఆస్తిపాస్తులే గాక అప్పుసప్పులకు కూడా మండలి వారసత్వం వహిస్తుంది. అవినీతిని ఆస్తిగా పరిగణించాలో అసమర్థతను అప్పుగా పరిగణించాలో తెలియదుగాని, ఈ రెండూ-ముఖ్యంగా రెండోది-

## రాజధాని కబుర్లు.

గృహనిర్మాణ మండలికి సంక్రమిస్తున్నాయి. మండలి భూములు సంపాదించి, ఇళ్లుకట్టించి ఇచ్చేముందు, తన ఇంట్లో బూజు దులుపుకుని, ఇల్లు చక్కబెట్టుకోడం మంచిది.

శ్రీ రాఘవరెడ్డి అనుభవజ్ఞులు. ఎర్రటేపును తెంపి ఆలోచించగల తాహతు ఆయనలో కనుపిస్తోంది. అనుభవానికి సాధారణంగా తోడుకాని ఉత్సాహం ఆయనలో కనుపిస్తోంది. హైదరాబాదు నిజమైన భాగ్యనగరంగా రూపొందించగల భాగ్యం ఆయనదన్న ప్రజల విశ్వాసం ఊరికే పోతుందా! ★

బలవంతాన పెదవులమీద నవ్వు పులుముకొంటూ "అంతా వట్టిదే అన్నయ్యా, వదిన అలాగే చెప్తుంది..." అంది పద్మ.

ఆ అబద్ధానికి సత్యవతి ఆశ్చర్యంతో నోరు తెరిచింది! ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసి, పద్మకిచ్చాడు అన్న.

"కొంచెంసేపు బాల్కనీలో కూర్చో... తేలికగా ఉంటుంది" రామం అన్నాడు చెల్లెలు మొహంలోకి ఆప్యాయంగా చూస్తూ.

పద్మ మౌనంగా మేడమీదకు వెళ్ళిపోయింది.

"పిచ్చిపిల్ల—ఎందుకో బాధపడుతోంది"

"ఇందాకా ఒక్క మచ్చున ఏడ్చింది. ఇప్పుడు లేదంటోందిగానీ..."

రామం ఏదో ఆలోచించాడు.

"సాయంత్రం టీపార్టీకి ఎవరెవరు వచ్చారు?"

"రవి తప్ప అందరూ వచ్చారు."

చిరునవ్వునవ్వాడు. "యురేకా!.ఇప్పుడు తెలిసింది, పద్మ ఎందుకు బాధపడుతోందో"

చీకటిగా వున్న గదిలో హఠాత్తుగా మెర్క్యురీ లైట్ వెలిగించినట్లయింది సత్యవతికి. "నా మతి మండిపోనూ, మీరు చెప్పేటంతవరకూ ఈ విషయం తెలుసుకోలేకపోయాను!" మూతిని సున్నాలా చుట్టి, కళ్ళు పెద్దవిగా చేస్తూ. "ఓహ్-అద్భుతం!" అంటూ రామం ఒక్క ఉదుటున ఆమె దగ్గరికి దూకాడు.

"సత్యా. ఈ పోజులో నే నీవెంత బావుంటావని!" ఉద్రేకంతో అన్నాడు.

సోఫాలోనుంచి లేచి-"చాల్లే ఊరుకోండి" బుంగమూతి పెట్టి చిరుకోపంతో అంది సత్యవతి. తమాయించుకొన్నాడు. అప్రయత్నంగా టేబుల్ వంక చూసి, "అబ్బో, చాలా ప్రెజెంట్సే వచ్చాయే-పద్మకు... టేబులంతా నిండిపోయింది." భుజాలెగరేస్తూ అన్నాడు.

సత్యవతి ఫలహారం, కాఫీ భర్త ముందుంచింది. గులాబ్‌జామ్‌మీదకు దండయాత్ర చేశాడు!

"సాయంత్రం అందరూ మిమ్మల్ని అడగడమే...ఇంట్లో ఫంక్షన్ పెట్టుకొని, మీ రెక్కడికో వెళ్ళడమేమిటి? మీ పద్ధతి నాకేం నచ్చలేదు."

"బినీత బెంగుళూర్ పోతున్నాను, స్టేషన్ కొచ్చి కలుసుకోమని లెటరు వ్రాసిందిగదా! అలాంటప్పుడు, వెళ్ళకపోతే ఏం మర్యాదగా ఉంటుంది చెప్పు?" పకోడీలను కసిదీరా నములుతూ అన్నాడు.

"అవునవును—మీరు వెళ్ళి ఆమెగార్ని కలుసుకోకపోతే, ఏమీ మర్యాదగా ఉండదు. అందులో, బినీతగారు మీకు కావలసినవారయ్యె!" ఎద్దేవా చేస్తూ.

నవ్వాడు. "అందుకే, అసూయ ముందు—ఆడవాళ్లు వెనకే పుట్టారంటారు...స్త్రీబుద్ధి పోనిచ్చుకొన్నావు కాదు!"

అంతలో బయట కారాగిన చప్పుడైంది. దంపతులిద్దరూ చూశారు. చిరునవ్వు మొహంతో రవి కనుపించాడు. సత్యవతి లైట్ వెలిగించింది.

"ఏమోయ్, రవీ! ఇప్పుడా రావడం... దీపాలు వెలిగాక్కానీ రాకూడదనుకొన్నావా?" రామం అడిగాడు.

"అవసరమైన పనొకటి తగిలింది-అందుకే ఆలస్యమైంది."

"నీకూ, మా వారికీ అవసరమైన పనులు లేనిదెప్పుడు?" అంది వ్యంగ్యంగా సత్యవతి, అతనికి ఫలహారం, కాఫీ అందిస్తూ. వాటిని కానిచ్చాడు రవి.

"పద్మఏదీ?" రామాన్ని అడిగాడు.

"మేడమీద వుంది వెళ్లు."

అడుగులచప్పుడు విని ఆలోచనలనుంచి తేరుకొంది పద్మ. రవిని చూసి కూడా చూడనట్లె నటించింది.

ఆమెకు చాలా కోపంగా ఉంది అతని మీద—పలకరించినా పలక్కూడదనుకొంది. గుండె వేగంగా, మరింత వేగంగా కొట్టుకుంటోంది.

దగ్గరగా వచ్చాడు, ఆమెకు. "పద్మా-.." సడీ సమాధానంలేదు. మొహంలోకి తేరిపార చూశాడు—ఆందోళన, ఆ వేదన స్పష్టంగా కనుపించాయి. పద్మ పెదవులు అదురుతున్నాయి, గాలికి రెపరెపలాడే గులాబీరేకుల్లా.

చిరునవ్వునవ్వాడు. "పద్మా, కంగ్రాచ్యులేషన్స్ నీ పుట్టినరోజు పండుక్కు ఈ చిన్నకానుక తీసుకో." చిన్నపెట్టెను కోటుజేబులోనుంచి తీసి ఆమెకు ఇవ్వబోయాడు.

పద్మ తీసుకోలేదు. అతడా పెట్టెను, ప్రక్కనే ఉన్న పిట్టగోడమీద పెట్టాడు. రెండు మూడు లిప్తలకాలం మౌనంగా ఆమెను చూశాడు.

"నేను రావడం ఆలస్యమయినందుకు, ఏమీ అనుకోకు—పద్మా."

"ఏమన్నా అనుకోవడానికి నేనెవర్ని?"

నవ్వాడు. "అంతకోపం దేనికిపద్మా? నేను ఏమన్నానని—.. "

"ఏమీ అనక్కర్లేదు."

"ఇంటికొచ్చిన అతిథిని ఇలాగేనా మర్యాద చెయ్యడం?"

"మేము మర్యాద తెలియని మనుషులం. మాకు గర్వంతో కళ్లు నెత్తికెక్కాయి! కండకావరం మమ్మల్నలా చేస్తోంది... మాకు మర్యాదంటే ఎలా తెలుస్తుంది మరి?"

రవి తొణకలేదు—బెణకలేదు.

# యుగళగీతం

"పద్మా, నీ కోసం తెప్పించాను క్షమించు."

"నేనెవర్ని మిమ్మల్ని క్షమించడానికి?"

"ఎందుకు పద్మా, నన్ను నీకే అలా చిన్నచూపు చూసుకొంటావ్? నీవు చాలా బాధపడుతున్నావ్, నాకు తెలుసు; నీ మనస్సు."

ఆమె చిన్నారిచేతిని తన చేతిలోనికి తీసుకొని, మృదువుగా నిమిరాడు. మెరుపుగా చేతిని వెనక్కు తీసుకుందా మనుకొంది. ఏవో అజ్ఞాతశక్తుల ప్రాభల్యంతో అలా చెయ్యలేకపోయింది. మనస్సులో ఏదో మధుర వేదన – అనిర్వచనీయమైన ఆందోళన.

రవి పెట్టెలోనుంచి, చక్కటి ఆకుపచ్చ రాయి ఉంగరం తీశాడు. ఆమె వ్రేలికి తొడిగాడు. పద్మ, అతన్ని కాదనాలను కొంది, కాదనా మనుకొంది....ఏమి చెయ్యలేని అశక్తత అలుముకొంది!

"పద్మా, నీవంటే నాకు చాలాఇష్టం!"

"నేను నమ్మను."

"నిజం...నన్ను నమ్ము!"

ఆమె కేదో వివశత్వం; అమోఘమైన పరవశత్వం—చక్కటి సీనరీని చూస్తున్నట్లుంది. మధురమైన సంగీతం వింటున్నట్లుంది. మూడుక్షణాల తర్వాత తేరుకొంది.

"మరి ఇన్నాళ్లూ నన్ను ఏడ్పించుకు తిన్నారే—?"

"పద్మా! నిన్ను మొదటిసారి చూసీ చూడగానే, నీపై ప్రేమలోపడ్డాను. నీవు చాలా పెంకిపిల్లవనీ, నీ ప్రేమను కోరిన ఎంతోమంది యువకులకు బుద్ధిచెప్పావనీ నాకు తెలుసు. వాళ్లలాగా, తొందరపడి ప్రేమను వ్యక్తంచేసి, నీ చేత పరాభవింపబడ దలుచుకోలేదు నేను...నీ ప్రేమను పొందడానికి ఒక అడ్డదోవ కనిపెట్టాను. నీవంటే నాకు ఏ మాత్రం ఇష్టంలేనట్లు, నిన్ను లెక్క చెయ్యనట్లు నటించాను...అందువల్ల ఎవరిలోనూ కనుపించని ఒక ప్రత్యేకత నాలో నీకు కనుపించి—నీకు తెలియకుండానే, నీ మనస్సులో నా రూపాన్ని ముద్రించుకొన్నావ్...నేను కోరుకొన్నదే—నా కోరిక తీరిందనే—అనుకొంటున్నాను!"

సిగ్గుతో పద్మ చెక్కిళ్లు చెంగల్వ పువ్వులైనాయి. ఆమె, బాధలూ, భయాలూ, కోపాలూ తాపాలూ అన్నీ...అన్నీ పొగ మంచులా ఇట్టే విడిపోయాయి.

"పద్మా—!" మురిపెంగా పిలిచాడు.

ఆమె మొహం అరుణరాగరంజితమైంది.. హృదయంలో తీయని ఊహలు మోసు లెత్తాయి!



---

ఖాతాదారు - అర్జంటుగా అణా బీడీలు ఇలా పారెయ్యవయ్యా!

దుకాణదారు- అసురసంధ్య వేళ అరువు ఏమిటయ్యా? ఇప్పుడేకదా దీపం వెలిగించాను?

ఖాతాదారు - బీడీలు చాలా అర్జంటు. దీపం ఆర్పేసి ఒకఅణా బీడీలు ఇవ్వు.

జి. వి. శ్యామ (భిలాయ్)

---



# తెలుగు వెలుగులు 43

పండితపుత్రులు పలువురు. తండ్రులకు తగ్గ తనయులు తక్కువ. ఏదేనొక విద్యలో అధికుడైన తండ్రిని మించిన తనయుడు అపురూపమనే చెప్పవచ్చు. అలా తన వంగడానికి మాత్రమేగాక మాతృదేశానికి కూడా చిరంతనమైన యశస్సు ఆర్జించినవాడు ధన్యుడు. చతురంగనాయకుడు శ్రీ జి. ఎస్. దీక్షిత్ అట్టివాడంటే ప్రవీణులు ఔననగలరు. సందేహం లేదు.

చతురంగం క్రీడకు మనదేశం పుట్టినిల్లు. ప్రపంచంలో మరి ఏ దేశమూ కని విని ఎరుగని కాలంలో ఈ క్రీడ భారతదేశంలో వ్యాప్తిలో ఉన్నదని చరిత్ర చాటుతున్నది.

అహింసయే పరమధర్మమని విశ్వసించిన బౌద్ధులు మనదేశంలో చతురంగ క్రీడాభివృద్ధికి విశేషంగా దోహదమిచ్చారు. విజిగీష మానవసహజమని వారు గుర్తించడమే దానికి కారణం. కనుకనే పాపమైన యుద్ధం వర్జిస్తూ మానవులకు సంతృప్తి చేకూర్చగలిగిన సాధనంగా చతురంగాన్ని స్వీకరించారు.

తథాగతుని బోధనలతోపాటుగా చతురంగాన్ని కూడా స్వీకరించి తమదిగా చేసుకొన్నారు తెలుగువారు. అందునా ఈ క్రీడలో తూర్పు గోదావరి మండలం ప్రముఖ స్థానం ఆక్రమించుకొన్నది.

శ్రీ గొల్లకోట సుబ్రహ్మణ్య దీక్షిత్ తండ్రి వెంకటరామయ్యగారు చతురంగం క్రీడలో ఆ మండలానికి మకుటంలేని రాజు. ముక్కుపచ్చలారని వయసులో తండ్రి చెప్పగా ఆటలో మెలకువలు నేర్చుకొన్నారు శ్రీ దీక్షిత్. అచిరకాలంలో తండ్రినే అవలీలగా ఓడించగలిగిన ప్రజ్ఞ సంపాదించారు.

చతురంగానికి పెట్టినిల్లు యూరోపు. ప్రపంచ వ్యాప్తి పొందిన తరువాత ఈ క్రీడ కొత్తరూపం సంతరించుకొన్నది. భారతీయ సంప్రదాయంలో పుట్టి పెరిగిన శ్రీ దీక్షిత్ పాశ్చాత్య సంప్రదాయం కూడా కరతలామలకమైనది.

సంప్రదాయాలు వేరు అయినా వస్తుతః క్రీడలో వచ్చిన మార్పు స్వల్పం. చతురంగ బలాల సమీకరణలోనేమి, వ్యూహరచనలోనేమి, ఒండొరుల ఎత్తులకు పై ఎత్తులు వేయడంలోనేమి బుద్ధిబలంలోని తారతమ్యమే కాని సంప్రదాయ భేదం అడ్డురాదు.

చతురంగం యువకుల క్రీడ. వయోవృద్ధులకు ఉబుసుపోకకు మాత్రమే ఉపకరించేదిన్ని. నేటివరకు ప్రపంచంలోకెల్లా ఘనులనిపించుకొన్న వారి చరిత్ర దీనికి తార్కాణం.

రక్తనాళాలలో ఉష్ణరక్తం ప్రవహించే కాలంలో మాత్రమే సాహసం సాధ్యం. సాహసం లేనిదే చతురంగంలో విజయం సాధించడం దుస్తరం. కురుక్షేత్ర సంగ్రామంలో అతిరథులు మహారథులు పలువురు పాల్గొన్నా యువకుడైన అభిమన్యుడే మహాభారత వీరుడుగా గణుతికెక్కాడు. మనదేశంలో చతురంగం క్రీడలో శ్రీ దీక్షిత్ ఒక్కరు మాత్రమే అభిమన్యుని తలపుకు తెచ్చే సాహసం చొరవ ప్రదర్శించగలవారు. ఎదుటివారి ఎత్తులకు పైఎత్తులు వేయడంలో ఆయనకు సాటిలేరు. "శ్రీ దీక్షిత్ 20 ఎత్తుల వరకు ఆలోచించి ఆడగల మేధావి. ఎత్తులలో ఆయనను బోల్తా కొట్టించగలమని ప్రత్యర్థులు భావించడం తమను తామే వంచించుకొనడం" అని 'ఇండియన్ ఛెస్' పత్రిక వ్రాసింది.

యౌవనంలోనే అనేక పర్యాయాలు బీహార్, ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాల ఛాంపియన్‌షిప్ గెలిచారు శ్రీ దీక్షిత్. కస్తూరికప్, రానడే ట్రోఫీ గెలిచారు. అంతర్జాతీయ కరస్పాండెన్స్ చతురంగం పోటీలలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. దేశంలో మొదటి ముగ్గురిలో ఒకరుగా సంవత్సరాల తరబడి పరిగణింపబడుతున్నారు.

ప్రావీణ్యం సంపాదించడమే కాదు; ప్రతిభావంతులైన యువకులను తనంతట తానుగా చేరదీసి వారికి గురువై మెలకువలు నేర్పిన విశాలహృదయుడు శ్రీ దీక్షిత్.

చతురంగం క్రీడలో ఆధిక్యం సాధించడానికి అయినా నిలబెట్టుకోడానికే అయినా కేవలం బుద్ధిబలం చాలదు. శారీరక దార్ఢ్యం అవశ్యకం. శ్రీ దీక్షిత్ కు ఏనాడూ అదే కరవుఅయినది. చిన్నతనంలో విద్యాభ్యాసానికి అడ్డుపడినదది. నేడు చతురంగం క్రీడ నిరంతరాయంగా కొనసాగించడానికి ప్రతిబంధకమైనదీ అదే.

శారీరకమైన బలహీనత, వయసు 'త్రోసి రాజ'న్నా శ్రీ దీక్షిత్ ఆట కట్టలేదు. ★

# చెదపురుగులు

దూర్వాసుల మార్తాండశాస్త్రి








'నీకు తెలీదు రాధా, అలాంటివాళ్ళను చాలా దూరంగా ఉంచాలి' అని చిరాగ్గా, కోటు వేసుకుంటూ అన్నాడు శ్యామమూర్తి. రాధ ఇచ్చిన తమలపాకులు నములుతూ ఆఫీసుకు బయలుదేరాడు. వంటింటి పని పూర్తిచేసుకుని లోనికి వచ్చింది రాధ. ఎవరో పిలిచినట్టు, తలుపు చప్పుడయినట్టు అయింది. చెయ్యి కడుక్కుని తలుపుతీసింది రాధ.

'ఏమే రాధా, ఇంకా భోజనం కాలేదా?' అని ఆప్యాయంగా అడిగింది సుందరమ్మ. "రండి బామ్మగారూ" అని లోనికి తీసుకు వెళ్ళింది. సుందరమ్మ ఆ వీధిలోనే ఉంటోంది. భర్త 30 ఏళ్ళకిందటే మరణించాడు. ఆమె కొడుకు కోడలువద్దా ఉంటోంది. ప్రతిరోజూ రాధ దగ్గరకు రావటం, ఆమెలో గొప్పతనాన్ని రాధ గ్రహించటం వాళ్ళ స్నేహాన్ని ద్విగుణీకృతం చేశాయి.

'చాలా చిక్కిపోతున్నావే, అమ్మా! పోనీ ఓవల్టీను తాగుదూ, కావలిస్తే రోజూ నేను కలుపుతాను' అంది సుందరమ్మ. రాధ సుందరమ్మకు తాంబూలం ఇచ్చింది. వక్కలు నోట్లో వేసుకుని సున్నం పట్టించి, ఆకులు చీల్చుతుండగానే నోట్లో కుక్కింది సుందరమ్మ. ఇంకా మీ మరిది రాలేదా కాలేజీనుంచి, అని ఏవో ప్రశ్నలు కురిపించింది. సుందరమ్మ ఉయ్యాలలో ఊగుతూ, గీతాపారాయణం సాగిస్తూంది. "అన్నట్టు రాధా, రోజూ స్త్రీలపాటలూ, గీతా, చెబుతాను నేర్చుకోకూడదా" అంది. స్త్రీలపాటలు పుచ్చుకని వంచేసింది సుందరమ్మ. సుందరమ్మ అలాగే నిద్రపోయింది. రాధ ఆమె పాండిత్యానికి చాలా ఆశ్చర్యపడింది.

తలుపు చప్పుడైంది. వేణూ కాలేజీ నుంచి వచ్చివుంటాడని తలుపు తీసింది రాధ.

వేణూ సైకిల్ లోపల ఉంచాడు. సైకిలు బెల్లు వాయించాడు గట్టిగా. అప్పటికి సుందరమ్మకు తెలివి వచ్చివుంటుంది. "అమ్మాయి, రాధా, లే అమ్మా. మీ మరిది వచ్చాడు అన్నం వడ్డించు", అంది. అప్పటికే రాధ వడ్డన పూర్తయింది. వేణూ మాటాడకుండా, భోజనం చేశాడు. తన రూమ్‌లో కూర్చున్నాడు. పుస్తకం తెరిచాడు చదువుదామని. మళ్ళీ ప్రారంభించింది సుందరమ్మ గీతాపారాయణం. సుందరమ్మతత్వం తనకు బాగా తెలుసును. కాని, ఏమన్నా అంటే వదినకు కోపంవస్తుందని వేణూకు తెలుసును. వేణూ పుస్తకం మూసేసి, కాసేపు నిద్రపోయాడు. సుందరమ్మకు నిద్రపట్టినట్టులేదు. "అమ్మాయి, రాధా, మీ మరిది కాలేజీ టైమవుతూంది, కాఫీ కలుపమ్మా" అని ఆప్యాయంగా లేపింది సుందరమ్మ. రాధ

వంటింట్లోకి వెళ్ళి పొయ్యి ముట్టించింది. తాను కూడా వంటింట్లోకి వెళ్ళింది సుందరమ్మ. "అమ్మా, నువ్వు తెలివైనదానివి కనక ఇంతలా సద్దుకుంటున్నావు. మరొకళ్ళయితే, చెయ్యగలరా" అనేసరికి రాధ పొంగిపోయింది. ఆమె జీవితంలో ఇంతవరకూ, చివరకు తన భర్త అయినా ఆమె తెలివితేటల్ని గ్రహించి మెచ్చుకోలేదు. ఆ విషయం సుందరమ్మ గ్రహించింది. అందుకే సుందరమ్మ అంటే రాధకు అంత మమకారం.

సుందరమ్మ అందుకుంది: "అమ్మా నువ్వు కాబట్టి కష్టపడయినా మరిదిని చదివిస్తున్నావు కానీ, ఇంకెవరైనా అయితే, ఒప్పుకుంటారా? నువ్వు నాలాగే ఒట్టి తెలివితక్కువదానివే అమ్మా. వీడమ్మా అన్నట్టు మీ అత్తారు పెట్టిన బంగారు" అని అడిగింది. మరిది చదువుకు వినియోగించానని చెప్పింది రాధ. "నువ్వు నా పిల్లలాంటి దానివి చెబుతున్నాను. జాగ్రత్త సుమా! అయినా నామాట వింటావో, వినవో," అని మధ్యలో ఆపేసింది సుందరమ్మ. "మామ్మగారూ, మీరు ఒకటే మా అమ్మ ఒకటేనా, నా క్షేమం కోరకు చెప్పేవాటికి ఆలోచించడమెందుకు చెప్పండి" అంది రాధ. "ఏం లేదమ్మా, వెలుగున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోవాలి; మీ 80 రూపాయల జీతంలో ఏమీ మిగల్చకపోతే మున్ముందు బాగుపడతావు? రేపు పిల్ల, పాప, మంచికీ, చెడ్డకూ, ఏమంటావు? అప్పుడు నీ స్థితి భగవంతుడికి తెలుస్తుంది. ఇవన్నీ మేము అనుభవించాము అమ్మా. ఈ బాధలు పగవానికైనా వద్దు. జాగ్రత్త, జీతం నువ్వే పుచ్చుకొని, నీ సంసారం చక్కబరుచుకో.

"ఈ కాలంలో డబ్బు, ఇంటిదగ్గరఉంటే మనదగ్గర ఉండాలికాని, వీధిలో తిరిగే మగవాళ్ళదగ్గర డబ్బుంటే నమ్మకం; నేను చెప్పలేక చెబుతున్నాను రాధమ్మా; ఏమీ అనుకోకు, ఎందుకైనా మంచిది. మీ అయన్ని ఓ కంట కనిపెడుతూ ఉండు" అని సంశయాత్మకంగా ఏవో తలపులు లేపింది రాధ మెదడులో సుందరమ్మ.

"అన్నట్టు ఇది ఎప్పుడు కొన్నావే" అని తీసింది అక్కడున్న కంచెంబు. చెంబు నాది [illegible] చెంబు. గాంధీ చిత్రంలో ఉన్న వేణును అలారంకన్నా ముందుగా కంచెంబు చప్పుడు లేపింది. "అయ్యో నా రాధా, ఎవరిముఖం చూశానో, ఈ వేళ; ఎంత పనైందిరా నాయనా" అంటూ గీతాపారాయణం మొదలెట్టింది సుందరమ్మ. రాధకు నిజంగా భయం వేసింది. అది చూస్తే భర్తకు కోపం వస్తుందని తెలుసు రాధకు. అయినా ఆ భయం ముఖంలో కనిపించనీయకుండా, "భయపడకండి మామ్మగారూ విచారించకండి. మళ్ళా చేయించవచ్చు" అంది రాధ; "ఏమిటి వదినా చప్పుడు", అని వంటింట్లోకి వచ్చాడు వేణు.

"ఏం చెప్పమన్నావు నాయనా", అని సుందరమ్మ అందుకోబోతూంటే, "కాదు వేణూ, పాడుపిల్లి తోడుపెట్టిన పెరుగు కాస్తా తిరగబోసింది" అని చెప్పింది రాధ. "పెరుగు ఎక్కడిది వదినా, లేదనేకదూ, నాకు నీళ్ళమజ్జిగ వేశావు" అన్నాడు వేణు. రాధ నాలిక కరచుకుంది. "అన్నట్టు నీకు కాలేజీ టైమ్అయినట్టుంది; త్వరగా కాఫీ తాగు" అని కాఫీ ఇచ్చింది. వేణు కాఫీ తాగి, సైకిల్ మీద కాలేజీకి వెళ్ళిపోయాడు.

"వస్తానమ్మా, ఈ వేళ ఎవరి ముఖం చూశానో, ఇంతపని అయింది" అంటూ వెళ్ళిపోయింది సుందరమ్మ.

సాయంత్రం 6 గంటలు అవుతూంది. ఫైలు పట్టుకుని, చిరాగ్గా ఇంటికి వచ్చాడు రామ్మూర్తి. కోటు స్టాండుకు తగిలించాడు. అక్కడ నేలమీద తాంబూలం ఉమ్మిన మరకలు కనిపించాయి. "రాధా! ఏమిటిది" అని అడిగాడు రామ్మూర్తి. గాభరాతో తడుముకుంటూ, "సుందరమ్మగారికి ద్వారం తగిలి దెబ్బతగిలింది లెండి" అంది రాధ. "అయితే తమరు, ఇంకా సుందరమ్మగారి శిష్యరికం సాగిస్తున్నారన్నమాట" అని చిరాగ్గా అడిగాడు రామ్మూర్తి. వేణు స్కూలునుంచి వచ్చాడు. "ఒరే! వేణూ, సుందరమ్మగారికి దెబ్బతగినప్పుడు ఇక్కడ ఉన్నావా?" అని అడిగాడు రామ్మూర్తి. అంతలో అందుకుని "వేణూ నువ్వు అప్పుడు తడిగుడ్డకూడా తలకు కట్టావుకదూ?" అంది రాధ. ఏమి చెప్పడానికీ తోచక, "అవు" నన్నట్టు తల వంకించాడు వేణు. వేణు వీధిలోకి వెళ్ళిపోయాడు.

కొంచెం చీకటిపడుతూంది. దీపాలు వెలిగించింది రాధ. "ఏమండీ, మడికట్టుకుంటారా," అని అడిగింది రాధ. "వేణు ఇంకా రాలేనట్టుంది" అన్నాడు రామ్మూర్తి. "సినిమాకి వెళతానన్నాడు మధ్యాహ్నం, మీరు రండి," అని వడ్డించింది రామ్మూర్తికి. కంచెంబు తియ్యబోయాడు. అక్కడ ఒక గ్లాసుమాత్రమే ఉంది. "అది పాడైపోయిందని దాచాను" అంది రాధ. "పెట్లో పెట్టి పూజ చెయ్యడానికా" అని విసుగ్గా రామ్మూర్తి అనగానే, "పోన్లెండి ఇప్పుడు చీకటి, రేపు తీస్తాలెండి," అని అప్పటికి సమాధానపరిచింది రాధ.

సుందరమ్మ మజ్జిగకు వచ్చింది; సగం మజ్జిగ సుందరమ్మకిచ్చేసి, మిగతాదాంట్లో కొంచెం నీళ్ళుపోసి, భర్తకు వేసింది రాధ. భోజనం పూర్తిచేసి ఆఫీసుఫైలు వ్రాసుకుంటున్నాడు. 10 గం|| అవుతూంది. వేణు వచ్చి తలుపుతట్టాడు. రాధ తలుపుతీసింది. వేణు భోజనానికి కూర్చున్నాడు. "ఏం కావా"లంది రాధ. "మజ్జిగ", అన్నాడు వేణు. "ఈ వేళ లేదు, ఆ తరవాణి పోసుకో" అని చలిదికుండలో నీళ్ళుపోసింది రాధ. "మధ్యాహ్నం, పెరుగు తిరగబోసిందిగా పిల్లి" అన్నాడు వేణు. వేణు భోజనం పూర్తయింది. లేచి, కుర్చీలో నిద్రపోతూన్న రామ్మూర్తిని లేపి పక్కమీద పడుకోమన్నాడు.

తెలతెల్లవారుతూంది; సుందరమ్మ తలుపుతోసుకుని లోనికివచ్చింది; అప్పుడే రాధ లేచి కుంపటికి నిప్పు అంటిస్తూంది. "కాఫీ కలుపుతున్నావా?" అని సుందరమ్మ వంటింట్లో ప్రవేశించింది. "ఏదో ఈ వెధవ ప్రాణం కాఫీలేకుంటే నిలవదు. అన్నట్టు, రాధమ్మా, బంగారులాంటి నీ ఒంటికి ఈ బట్ట బాగులేదే. నన్ను తెప్పించమన్నావా? కట్టుకుంటే మహాలక్ష్మిలా ఉంటావు" అంది: "అయితే మామ్మగారూ తెప్పించండి" అంది రాధ. సుందరమ్మ వెళ్ళి కొద్దిసేపట్లో ఆ చీర తీసుకువచ్చింది; ఆ చీర దారాలదగ్గరనుంచి పరిశీలించడం మొదలుపెట్టింది; "ఖరీదెంత"అని అడిగింది రాధ. "[illegible] అమ్మా, పాతిక,"అంది సుందరమ్మ. "పాతికే!" "అలా అనకు, నాకు తెలుసును నీకు ఇది ఉండా అని, డబ్బుకు సంకోచించకు. ఈ వేళ కాకుంటే రేపు జీతం అందగానే ఇచ్చేద్దువుగాని, నేను చెబుతాను" అని సుందరమ్మ వెళ్ళిపోయింది. ఆ చీర పెట్లోపెట్టింది రాధ. రామ్మూర్తి స్నానంచేసి వస్తూ చూశాడు సుందరమ్మ వెళ్ళిపోవడం. "ఏమండీ! సుందరమ్మగారూ అప్పుడే తగ్గిపోయిందా, నిన్నటి మీ తల మీద దెబ్బ" అని అడిగాడు. "ఏమిటో నాయనా!"అని సుందరమ్మ అంటూంటే, "నిన్న మీ తలకు దెబ్బతగిలింది కదూ, మధ్యాహ్నం [illegible]" అంది రాధ. "అబ్బా నాయనా తగ్గింది" అని వెళ్ళిపోయింది సుందరమ్మ.

సాయంత్రం ఆఫీసునుంచి వచ్చాడు రామ్మూర్తి. జీతం తనదగ్గరే ఉంచాలని నిర్ణయించుకుంది రాధ. భర్త [illegible]

(62 వ పేజీ చూడండి)

ఉపాధ్యాయుడు - రామూ, కొంగ ఒంటికాలిమీద ఎందుకు నిలబడుతుందిరా?

రామూ - రెండో కాలు ఎత్తితే పడిపోతుందని.

కె. వి. సుబ్బారావు (హైదరాబాదు)

# హరి వంశము

## సభా పర్వం - 3

అంధకోఽనుద్విగ్నమనా
ధైర్యా దవిక్లవం వచః
ప్రోవాచ వదతాం శ్రేష్ఠః
సమాజే కంసమోహనః

—హరివంశము.

కంసుడు అన్న ఆ మాటలు వసుదేవునికి తగిలినవా! హృదయములో శల్యములను పోలి గుచ్చుకొన్నవా! అదిర్న దర్శి అయిన కంసునియందు ఆయన కోపాన్ని ప్రదర్శించినాడా! వికారాన్ని పొందినాడా! అతిగంభీరమైన సముద్రాన్ని పోలి, స్తిమిత తరంగ ముమైన సముద్రాన్ని పోలి, నిష్ప్రకంపమైన చిత్తంకల్గి, తను ముక్క పుంభావం మూర్తిదాల్చినట్లు సభలో ఆసీనుడైవున్న ఆయనన్ను చూచి సభాసదులు అనేకవిధాలుగా అనుకున్నారు. ఆయన ఈ కంసుని అధిక్షేపసంభాషణమునకు ప్రత్యుత్తరం ఇస్తే బాగా అనుకున్నవాళ్లు కొందరు ఆ సభలో వున్నారుగాని, ఆయన అట్లా చేయలేదు. మనస్సులో మందహసించి, మౌనంగా వూరు కున్నాడు. ఈ కంసుడు మాట్లాడుతున్నంతసేపు—నీవు మూర్ఖుడవు; అజ్ఞానివి; మత్తి నీతిమీదకురాగా చిత్తంవచ్చినట్లు ప్రేలుతు న్నావు—అన్న భావంగా చిరునవ్వు నవ్వుతూ కూర్చున్నాడు. ఆయన ఆ శాంతిస్తిమితమైన మూర్తిని చూచి, కంసునియందు ఆయన చూపిస్తున్న అనుగ్రహాన్ని గమనించి సభ్యులు ఆశ్చర్యపోయి నారు. కంసుని వాచోవైదగ్ధ్యాన్ని దర్శించి ధిక్, ధిక్, అని అతణ్ణి తృణీకరించారు. ఆ తృణీకారసంబాధంలో హృదయ సంబాధంగా కంసునికి అంధకుని అసకృద్దానము చిల్లులుగా చెవు లకుసోకి, హృదయాన్ని పొడిచి, అగడితమైన వేదనను, క్రోధాన్ని కలిగించింది. తాను అనుకొన్నది ఒకటి; సభలో జరిగింది ఒకటి; కంసుణ్ణి, తన్ను, మహారాజును, మధురేశ్వరుణ్ణి గౌరవించి, యాదవవృద్ధులు వసుదేవుణ్ణి మందలించగలరని అనుకొన్న తన ఆలో చన వ్యర్థము అయిపోయింది. పెద్దఎత్తున ఒక్క సముద్రతరంగం లేచి, అప్రతిద్వంద్వమైన పర్వతాన్ని తాకి, కోవ్వురవ్వలుగా చివ్వలుతేగి, వ్యర్థమతియై, వెనక్కి పోలేక, ముందుకు జరగలేక, చిల్లులుగా వెల్లువేగినట్లు కంసుడు గుడుగుల్లు తిరిగిపోయినాడు. గుడుగుల్లు తిరిగి వేయిగొంతుకలుగా నవ్వినాడు. అపూర్వమైన ఆ అట్టహాసాన్ని విని సభ స్తంభించిపోయింది. మదించిన ఏనుగును పోలి సభలో కదలా డుతూ కంసుడు ప్రతిఒక్క యాదవుణ్ణి కరుకుగా చూచాడు. కర్కశంగా మాట్లాడినాడు. ఆ సభలో అతని కంఠం ఒక్కటి సము ద్రంలో పెనుతుఫాను పుట్టినట్లు పొంగులు పోయింది. ఒద్దికలేని హద్దులు మీరింది. ఆ పెనుగాలిని సభ తట్టుకోలేకపోగా కంసుడే అక్రూరుణ్ణి సంబోధించినాడు. "దానపతీ!" అని సంబోధించి, ఇట్లా అన్నాడు!

"దానపతీ! నువ్వు వెంటనే వ్రజానికి బయలుదేరి వెళ్ళు, ఎందుకో చెబుతున్నాను. నందగోపుడు, ఇంకా ఇతరులైన ఆభీరులు మనకు ఈయేటికిగల అరి కట్టవలసివుంది. ఈ విషయాన్ని వారికి చెప్పి, వారిని వెంటపెట్టుకొని రావలసివుంది. ఇది ఆజ్ఞసుమా! వారితో సహా నీవు ఇక్కడ వున్నట్లు మళ్ళీ మధురకు రావాలి."

ఈ మాటలు చెప్పి కంసుడు చిరునవ్వులుగా సభలో అందర్ని తిరిగి కలయచూచాడు. అతని ఆలోచనయేమిటో, ఎవ్వరికీ అర్థం కావడంలేదు. ఆ అర్థంకానితనం వారి ముఖాలలో కన్పించగా, కంసుడు తన్నుతాను ప్రశంసించుకున్నట్లు మందహాసం చేసుకుంటూ తిరిగి దానపతియైన అక్రూరుణ్ణి ఆలోకించి ఇట్లా అన్నాడు:

"అన్నట్లు మరిచిపోయినాను. దానపతీ! నా ధనస్సు వున్నది చూచావా! దానికి మహోత్సవం చెయ్యాలని తలపెట్టాను. ఆ ఉత్స వానికి అనేక దేశాధీశులయిన రాజులను, మహనీయులైన మహాదేవ తలను ఆహ్వానించినాను. వారంతా అందుకు వస్తున్నారు. పెక్కు దినములు వారికి ఆతిథ్యం ఒనర్చవలసివుంటుంది. అందువల్ల నా మాటలుగా ప్రజానులైన గోపకులకు ఇట్లా చెప్పు: కంస మహా రాజు ధనుర్యజ్ఞం చేస్తున్నారు. మీరు అందరు వనాలలో సుఖంగా వుండే అర్థాన్ని తలపెట్టే మహారాజు ఈ ధనుర్మఖాన్ని తలపెట్టారు. కనుక అందుకు కావలసిన సర్వ సంభారాలను మీరు సమకూర్చాలి. పాలు, పెరుగు, నేయి, మజ్జిగ మీరు సమకూర్చాలి. అంతేకాదు. అరణ్యసంభవములైన మధువులనుగూడా సమకూర్చాలి. ఈ మాటలు నా ఆజ్ఞగా వారితో చెప్పి వారిని నువ్వు వెంటపెట్టుకురావాలి సుమా!"

కంసుడు మళ్ళీ ఆగాడు. మళ్ళీ సభను కలయ తిలకించాడు. మళ్ళీ చిరునవ్వులు ప్రయోగించాడు. కంసుని ఉద్దేశమేమిటో సభలోని పెద్దలకు ఇంకా అర్థం కాలేదు. ఈ ధనుర్యజ్ఞం ఏమిటా అని మాత్రం అనుకున్నారు. కాని ఒక్కటిమాత్రం వారికి అర్థమయ్యీ, కానట్లు మనస్సులలో ఆడింది. కంసుడు ఇప్పుడు ఏదో క్రొత్త ఎత్తు ఎత్తినాడు. అదియేమిటో ఇంకా తెలియలేదు. ఒకరినిచూచి ఒకరు, ఏమో అన్నట్లు తలలు వంకించారు.

వారు తెలియలేదు అని అనుకున్నంతలో కంసుడు తిరిగి అక్రూరుణ్ణి సంబోధించినాడు: "అక్రూర! మందలో నాకు మేనల్లుళ్లు అయినవాళ్లు ఇద్దరు వున్నారు. కృష్ణుడని; సంకర్షణుడని; వారిద్దరు వసుదేవుని కుమారులు. వారిద్దరు యుద్ధ విశారదులని వింటు న్నాము. కాలనిర్యాణయోధులని వింటున్నాము. వారు సమ యానుకూలయుద్ధవిశారదులటయ్యా! అక్రూర! వ్యాయామోద్దక్ష ములటయ్యా వారు! వారిని మేము దర్శించాలని ఇచ్ఛ చేస్తు న్నాము. వారికి ఇట్లా చెప్పు: మీకు మేనమామ, మధురేశ్వరుడు, కంస మహారాజు మీ అద్భుత ప్రతాపాన్ని గూర్చి విన్నాడు. మీరు ఆయన మనస్సుకు నచ్చారు. సభృత్యుడై, సపురోహితుడై, ఆయన మిమ్మల్ని చూస్తాడు. మీరు మధురకు రావాలి: అని చెప్పి వారిని గూడా వెంటపెట్టుకురా."



అని తాను ఏదో మహావిజయాన్ని సాధించినట్లు కంసుడు సభను తిలకించాడు. ప్రతి సభ్యంగా తిలకించాడు. అతని చూపులు వసుదేవునిమీద తాళి నిల్చాయి. ఆయనలో ఏ భావము అతనికి కన్పించలేదు. ఆయనముఖంలో ఉత్సాహముగాని, విచారముగాని, ఔత్సుక్యముగాని. భయముగాని ఏమీ కన్పించలేదు. ఆయనను ఆ స్థితిలో చూడగా కంసునికి తన్నుగూర్చి భయమైపోయింది. ఆ భయాన్ని లోపల దాచుకుంటూ తన చూపులను ఆయనమీద నుండి త్రిప్పుకున్నాడు కంసుడు. అప్పుడు అతని చూపులు అంధకునిమీద వ్రాలాయి. ఆ అంధకుడు తెల్లని మేఘపు శకలములను పోనిగడ్డాన్ని సవరించుకుంటూ, అల్లన మందహాసం చేస్తూ, మెల్లని అవహేళనగా తన చూపులలో చూపులుగా ఉల్లన చూడుతున్నట్లు కూర్చున్నాడు. ఆ వృద్ధుని ఆవైఖరి చూడగా కంసునికికోపం వచ్చింది. హృదయంలో భయం రేచ్చింది. తిరిగికంసుడు దానపతిని సంబోధించాడు. "దానపతీ! వసుదేవ నందనుల ప్రథిమ ఏమిటో చూడాలని నాకువుంది. మాదగ్గర ఇద్దరు మల్లులువున్నారు. నీవు ఎరుగుదువుగదా! వారితో ఈనా మేనల్లుండ్రకు క్రీడా సంయుగాన్ని ఏర్పాటు చేస్తున్నాము. ఎల్ల జనులకు ఉత్సవంగా వారిదోర్దర్పాన్ని, దోర్దర్పం పరిణతిని మేము పరిశీల చేస్తాము. నామేనల్లుండ్రు దేవతలతో సమానులు. దానపతీ! నీకు తెలుసునో లేదో; వారి పౌరుష క్రీడను మేము అవశ్యం దర్శించాలి."

తిరిగి కంసుడు సభను తిలకించాడు. అప్పుడు సభలో అందరికి అతని ఆలోచన యేమిటో అర్థం అయింది. వారికి ఏమీతోచలేదు; ఏమిఅనాలో తెలియలేదు; కంసుడు వారికి మాట్లాడ్డానికే అవకాశం ఇయ్యలేదు. వారిని ఒక్కొకరినిగా, అందరినిగా చూస్తూ తిరిగి అక్రూరుణ్ని సంబోధించి, కంసుడు ఇట్లా అన్నాడు: అక్రూర! నా మేనల్లుండ్రు వున్నారు చూశావు! వారు నాకు శత్రుండ్రబిడ్డలు సుమా! అందువల్ల నాకు ముఖ్యులు అని తెలుసుకో. ఇప్పుడు నీవు తెలుసుకోవలసినవిషయం ఇంకొకటిగూడా వుంది. ఆ నా మేనల్లుళ్ళు వ్రజంలో పుట్టారు. వనాల్లో పెరిగారు. పైగా బాలురు. వారితో నువ్వు మెత్తగా మాట్లాడాలి. ఇంపు పుట్టేట్లు మాట్లాడాలి. కఠోరంగా మాట్లాడకూడదు. దోషం కల్పించనీయకూడదు. [illegible]దిగా నా చెప్పినమాటలు చెప్పి ఉత్సాహాన్ని పుట్టించి వారిని నీవు వెంట పెట్టుకురావాలి. దానపతీ! ఇది నా ఆజ్ఞ. ఈఆజ్ఞను నీవు పాలించాలి సుమా! పాలింతువో, తెలుసునుగదా! నాసంగతి! నిన్ను నిగ్రహిస్తాను. పాలించావో నాకు నీకన్నా అత్యంతము ఉపకారం చేసినవాడు మరొక్కడు లేడనుకుంటాను. నాకు నా మేనల్లుండ్రను చూడాలన్న కుతూహలం మెండై నిన్ను ఇట్లా ఆజ్ఞాపిస్తున్నాను. వేరే ఏమీలేదు. ఇదిగో! ఇంకోమాట నీవు యిపుడే మధురనుంచి బయలుదేరు. ఈ వసుదేవుడితో గుసగుసలాడేవు సుమా. అతని కంఠపు లేమీ వినకు. ఇక కదులు. అని కంసుడు సభను తిలకించాడు. సభలో ఎవ్వరూ ఏమి అనాలో తెలియనివారై పూరకవుండి పోయినారు. అక్రూరుని మాత్రం కంసుని ఈ ఆజ్ఞ తృషితుడైన వానికి మంచి నీటిపట్టు కన్పించినట్లువుంది. ఆయన కంసుని ఆజ్ఞను శిరసాధరించినవాడై సభలోంచి కదిలిపోయినాడు. సభలో ఎవ్వరికి వారు ఈ అవకాశాన్ని కంసుడు తమకు కల్పించివుంటే బాగుండేది గదా అనుకున్నారు. ఆసభలో కూర్చోనడమే వారికి కష్టంగావుంది. కంసుడు చేసిన సాధుదూషణ వినిగూడా తాము అట్లా కూర్చుండి పోయి వుండినందులకు వారిని వారే నిందించుకున్నారు. కాని ఏ ఒక్కరు కంసుణ్ణి ప్రతిఘటించి ఒక్కమాట అనలేకపోయినారు. అక్రూరుడు సభలోంచి కదిలిపోతూఉండగా, అతనికి కల్గిన ఆ అదృష్టమును మెచ్చుకున్నారు. వసుదేవుని నందనులతో తనకుగలవైరాన్ని

నీకన్న ఆ అసమంజసుడే నయం అనిపించుకున్నాడు. మరి నీవో! రాజవంశంలో పుట్టినివాని విధంగా, ఎక్కడో పుట్టి ఏమిటికో ఇక్కడికి వచ్చినవిధంగా, శ్రీకి దక్క వనంలో జడలు కాల్పగా పారెయుడు విధంగా, ముందు వెనుకలు చూచుకోకుండా, వృద్ధ బాంధవుణ్ణి, సకల యాదవరాజులోకానికి ధ్యేయుణ్ణి, దురుక్తులతో బాధ పెట్టావు. కంసుడా! నీవు రాజవా! కాదు. నీచుడవు."

ఆ మాటలు విని కంసుడు దండతాడితమైన భుజంగాన్ని పోలి లేవబోయినాడు. అట్టివాణ్ణి, అంధకుడు "కూర్చో"అని, చిన్న పిల్లవాణ్ణి అదలించినట్లు అదలించి, తిరిగి తన వాక్యాన్ని కొనసాగించాడు: కంస! ఈ మాటలు నిన్ను అంటున్నాను అనుకోవద్దు. నీ తల్లిదండ్రులను అంటున్నాను. వారు నిజంగా శోచ్యులు కదా! నీవంటి పుత్రుణ్ణి కన్న తల్లిదండ్రులు ఎంత పాపం చేసుకున్నారో కదా! నువ్వు అన్యాయాంతకారివి. అట్టి నిన్ను వారు కన్నారు. అప్పుడు కులానికి ఇంతచేటు కల్గినదంటే, అందులో ఆశ్చర్యం ఏమి వుంది? ఇంతకీ కష్టం అంతా ఉగ్రసేనుడిది. వాడు నిన్ను కుల పాంసుణ్ణి కన్నాడు. దుర్జాతీయుణ్ణి కన్నాడు. కన్నందుకు కుమిలి పోతున్నాడు.

"కంస! నీవు స్వంతంగా ఒక మనీషిని అనుకుంటున్నావు. కాని కాదు. మనీషి అయినవాడు ఎవ్వడూ తన గుణాలను తాను పొగడుకొనడు. ఇతరులు తన గుణాలను గూర్చి పొగడటం పద్ధతి గాని, తనే తన గుణాలను పొగడుకొనడం పద్ధతి కాదు. ధర్మం కాదు. శాస్త్రం కాదు. నీవంటి ఆత్మశ్లాఘి పుట్టినందువల్ల, నీవంటి ఆత్మశ్లాఘి పరిపాలనను అంగీకరించినందువల్ల, పృథివిలో యదు వంశమే నిందాపాత్రమై పోయింది. మావంటి మూర్ఖులు కాకపోతే ఎవ్వరు నీవంటి బాలునియొక్క, మూఢునియొక్క, కులాంతకృత్తు యొక్క శాసనాన్ని ఆమోదిస్తారు! అందువల్ల పదిమంది రాజులు యాదవులను చూచి నవ్వుతున్నారంటే,అందులో దోషం ఏమి వుంది?

"కంస! నీ మాట్లాడిన పద్ధతి చూస్తే, నీవు ఏమనుకుంటున్నావో తెలిసిపోతూనే వుంది. నీవు నిక్కం మాట్లాడినాను అనుకుంటున్నావు. సత్యం మాట్లాడినాను అనుకుంటున్నావు. లోకం యొక్క ఔచిత్యం తెలిసి మాట్లాడినాను అనుకుంటున్నావు. కాని ఇక్కడ ఒక్క ప్రతిబంధకం వుంది. ఈ పద్ధతివల్ల ప్రపంచంలో ఎప్పుడైనా ఏ కార్యమైనా సానుకూలపడిందా? నీవే చెప్పు. నాకు చూడగా నీవు వెలుపడి, ఆత్మ మర్యాద కొరవడి, ఎవంగా మాటాడినట్లు మాత్రమే కన్పిస్తున్నది. ప్రాకృత రాజులు ఎవరైనా ఇట్లా అయినారా? మాట్లాడినారా!

"కంస! ఒక్కమాట చెబుతున్నాను విను. తగవు ఎరిగినవాడు, మానఘనుడు, అనవలీఢ మార్గనిష్ఠుడు, అయిన బుధుణ్ణి మొగము కాదరగ కులుక మాటలతో నొప్పించడం బ్రహ్మహత్యతో సమానమైన పాపంగా ఆర్యులు పేర్కొన్నారు. ఇప్పుడు నీవు అట్లా చేశావు. వంశవృద్ధులయిన వాళ్ళను సభలలో పూజించడం ఎరుగున్నాము గాని, ఇట్లా వారిని ఒక కట్టడి అవమానం చేయడం ఎక్కడా చూడలేదు. వంశవృద్ధులు అభిపూజనములకు భాజనములు. వారిని నీవు అవమానంచేసి నొప్పించావు. వారికోపం అగ్నివంటిది. ఎటువంటి ఘనుడైనా అది దహించివేస్తుంది.

"తాత! బుధులు నడచే తెరువులు తెలుసుకొనడమే కష్టం. జలంలో మత్స్యములు మెలగేజాడలు ఎట్లా తెలుసుకోలేమో, ఇది కూడా అట్లాగే తెలుసుకోలేము. కాని శాంతితో, దాంతితో ప్రయత్నంచేస్తే, అబుధుల మార్గం ఏమిటో అవగతం అవుతుంది. నీలో ఆశాంతి దాంతులు రెండు కొరవడిపోయినాయి. అట్టి నీవు కులవృద్ధులను నొప్పించడం కన్నా వేరేపని ఎట్లా చేస్తావు! నీవు పోతె దర్పంతో అగ్ని సమానులైన వృద్ధులను నొప్పించడం అంటూ పెట్టుకుంటే, అమంత్రకమైన ఆహుతిని పోలి, ఆ మాటలు వారిని మర్మఘ్నములై బాధపెడతాయి. ఇది నీకు తెలియదు.

"ఇప్పుడు నీవు వసుదేవుణ్ణి నిందిస్తున్నావు. ఏమని నిందిస్తున్నావు? పుత్రగోపనం చేస్తాడని నిందిస్తున్నావు. అయితే ఏ తండ్రి తన బిడ్డలను ఆపదలపాలు కానిస్తాడు? తన ఓపినట్లు బిడ్డలను ఆపదలు పొదలకుండా చూచుకొనక మానిస్తాడా? నిన్నే చూచుకో. నీతల్లి దండ్రులు ప్రయత్నంతో పెంచకుండానే నువ్వు ఇంత వాడవైనావా? పుత్రుణ్ణి పోషించుకోనివాడు పుంనామనరకంలో తల్లి దండ్రులు పడిపోతారనిగదా శాస్త్రాలు చెబుతున్నవి. అప్పుడు పుత్రుణ్ణి పోషించుకొనడం వసుదేవుని తప్పు ఎట్లా అవుతుంది! నీ చేసిన వసుదేవ నిందవలన కులం మొత్తం విషం త్రావినట్లయింది. సర్వ యాదవవంశాన్ని నిందించినట్లయింది. ఈ పనిని నీవు ఎందుకు చేస్తున్నావు? నీకు కృష్ణ, సంకర్షణులయందు అకారణమైన వైరం పుట్టుకు వచ్చింది. ఆ వైరంతో ఎన్నో భ్రూణ హత్యలు చేయించావు. బాలఘ్నుడవైనావు. ఇందులో నువ్వే ప్రథమాపరాధివి. అట్టివాడవు, నీవు వసుదేవుణ్ణినిందించడంలో అర్థం ఏమిటి?

"కంస! నీకు రోజులు దగ్గరలో పడినాయి. రాజులకు అరిష్టం అగా దైవజ్ఞులు ఏయే నిమిత్తాలను నిర్ణయించారో, అవి అన్ని ఇప్పుడు కన్పిస్తున్నాయి. భవద్వినాశసూచకములైన దుస్స్వప్నాలను, మృగపక్షి చేష్టితాలను, చూస్తున్నాము. దేవతా ప్రతిమలు చలించుటలు, ఉల్కా నిర్ఘాతంబులుపడుటలు, సూర్య చంద్ర మండలంబులు ప్రచండ కబంధగ్రహణాది వైకృతములను పొందుటలు, పాప గ్రహములు క్రూరరాసులలో వక్రించుటలు, చూస్తున్నాము. రాజవ్యపాయమునకు ఇవి అన్నీ నిమిత్తాలు. అవి అన్నీ ఇప్పుడు కన్పిస్తున్నాయి. ఇక నీకు శుభం కల్గడం అనేది దుర్లభం.

"కంస! నీవు మాకు బిడ్డవంటివాడివి. ఇంతకాలం నిన్ను సహిస్తూ వచ్చాము. నీవు ఇప్పుడు చేసిన వృద్ధ మానభంగంవల్ల మా మనస్సులు కలగిపోయినాయి. మేము నిన్ను విడిచిపోతాము పో! నువ్వు ఈ రాజ్యాన్ని శాసించగలవా? నీవు ఇట్టి నీచుడవని యెరుగక, అనాచారుడవైన నిన్ను అవిచారులమై నీయందు వాత్సల్యం చేయడమే మా తప్పై పోయింది. ఇప్పుడే కూడా నీయందు ఆ వాత్సల్యాన్ని విడువలేకుండా వున్నాము మేము. మేము గాఢ భయులము. అందుకు మమ్మల్ని మేమే నిందించుకోవాలిగాని నిన్ను అని లాభం ఏమివుంది.

"తాత! నీవు కృష్ణునితో వైరం పెట్టుకొని సుఖాన్నే అను కుంటున్నావా? వారిని ఇప్పుడు నీవు జోగానకు ఆహ్వానిస్తున్నావు. అందులో కూడా తంత్రమే చేస్తున్నావు. నీ తంత్రం ఫలిస్తుందా? నీవు వారితో తొడరిన తర్వాత బ్రతుకువున్నావా! ఉన్నదో, అది నీ చేసినతపం; నీ భాగ్యం; నాకు ఆ నమ్మకంలేదు. కనుక ఒక్కమాట చెప్పదలుచుకున్నాను. వింటేవిను. లేకపోలేదు. ఆ పైన అంతా నీ అదృష్టం. కృష్ణునితో నీకు విరోధం వద్దు. ఆ విరోధంతో యాదవులలో కలతలు పెంచవద్దు. వసుదేవుడు మంచివాడు. నీయందు అధికమైన అనుక్రోశం గలవాడు. అయనన్ను వెంటబెట్టుకొని మండలకుపో. అక్కడ కృష్ణుణ్ణి ఆశ్రయించు, నీకు మేలవుతుంది. లేదో, ఆ కృష్ణుడే ఇక్కడికి వచ్చాడో, నీకు క్షోభం తప్పదు. నీ వెంట ఎవరో మహావీరులు వున్నారన్న గర్వం తగదు. వారితో, నీతో ఏమవుతుంది. మిమ్మల్ని అందర్ని వాసుదేవుడు వధిస్తాడు. ఆ దశ నీకు తప్పదు. దాన్ని ఎవరు తప్పించలేరు." ★

# రాశిఫలాలు

**20-7-60 బుధవారం మొదలు**
**26-7-60 మంగళవారం వరకు.**

బంగారు ధర ఈ వారారంభంలో తగ్గి నిలబడుతుంది. వెండి ధర మామూలుగానే ఉంటుంది.

పసుపు ధర 21, 22 లలో పెరుగుదల, తిరిగి మందీ, వేరుశెనగపప్పు, నూనెధర మొత్తంమీద కొద్దిగా పెరుగుతుంది. మిర్చి ధరలో మందీ కనుపిస్తుంది.

బెల్లము ధర, చింతపండు ధర తేజీ వస్తుంది. మినుములధర తేజీ వచ్చి నిలుస్తుంది. శెనగల ధరలో ప్రస్తుతం మందీ వచ్చినా ముందుముందు పెరగగల అవకాశాలున్నవి.

* * *

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

సాధారణంగా ప్రతివిషయంలోనూ చురుకుగా ముందుకు పోగలుగుతారు. వృత్తికి సంబంధించిన కార్యకలాపాలలో ఇతరుల సహాయం లభిస్తుంది. ఆదాయం పెరుగుతుంది బంధువుల వద్దనుంచి రావలసిన వార్తలు ఆలస్యంగా రావచ్చు. అయితే సుముఖంగా ఉంటవి. ప్రయాణాలు సుఖంగా సాగుతవి. కుటుంబంలోని వారి ఆరోగ్యం మాత్రం సరిగా ఉండదు. విలువగల వస్తువులు కొనే ప్రయత్నాలు ప్రస్తుతం నిలుపుకోవలసి వస్తుంది. నౌకరులు మొదలయిన వారివల్ల నష్టం కనిపిస్తుంది. వారం రెండవ భాగంలో కార్యభారంవల్ల సుఖం లోపిస్తుంది. 21,22 లలో సందేహాలు, ఆశ్చర్యము, ఆందోళన కలిగే వార్తలు.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రస్తుతం తలవనితలంపుగా జరిగే సంఘటనలు తాత్కాలికంగా ఆశ్చర్యాన్ని కలిగించినా చివరకు ఫలితం బాగుంటుంది. అధికారులతో పరిచయం లభిస్తుంది. మీ తొందరపాటువల్ల మీ మిత్రులు మీకు దూరం కాకుండా చూచుకోనండి. అనేక రకాల కార్యభారం పైనపెట్టుకుని నిర్వహించగలుగుతారు. ఆదాయము, ఖర్చులు రెండు విశేషంగానే ఉంటవి. తరచు సంఘకార్యాలలో పాల్గొంటారు. వ్యవహారరంగంలో అనుకూలత ఉంటుంది. స్థిరాస్తులు కొనటం, విశేషంగా పెట్టుబడిపెట్టి పెద్దవ్యాపారం వంటి పనులు ఆరంభించటం మొదలయిన పనులకు అనుకూలమైన సమయం. 24, 25 లలో గౌరవప్రాప్తి, వృత్తిలో అభివృద్ధి, క్రొత్తవారితో స్నేహం.

> మేష వృషభాలలో అంగారకుడు, మిధునంలో బుధుడు. కర్కాటకంలో సూర్య శుక్రులు, సింహంలో రాహువు, ధనుస్సులో గురు శనులు, కుంభంలో కేతువు. వృషభ మిథున కటక సింహాలలో చంద్రుడు.

* * *

## మిథునం :

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

శుక్రగ్రహంవల్ల, వ్యతిరేకంకానున్నట్లు కనుపించిన వ్యవహారాలు అనుకూలిస్తవి. కొన్ని ముఖ్య విషయాలలో మీ ఆత్మీయులే మీకు ప్రతిబంధకంగా కనుపిస్తారు. శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తవి. ఇంతకు ముందు మిమ్మల్ని బాధిస్తున్న సందేహాలు తొలగిపోయి వృత్తి ఉద్యోగాలలో మనశ్శాంతి లభిస్తుంది. సాటివారి ఆదరాభిమానాలు లభిస్తవి. బంధుమిత్రుల కలహాలలో జోక్యం కలిగించుకోవలసి వస్తుంది. అయినా మీమాటకు విలువ పెరుగుతుంది. క్రొత్త మార్గాలలో ఆదాయవృద్ధి ప్రయత్నాలు అనుకూలిస్తవి. మీఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండటం అవసరం. 20, 21 తేదులలో వృథా త్రిప్పట, దుర్వార్తలు, పొరపాట్లు చేయటం.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

మనస్సులో ఎన్నో యోచనలు ఉంటవి సమయం వచ్చినప్పుడు ఆసక్తి తగ్గుతుంది. విశ్రాంతిగాఉందామని అనుకుంటారు. కాని సాధ్యంకాదు. కుటుంబనిర్వహణ శ్రమకరంగా తోస్తుంది. ఆదాయం బాగానే ఉంటుంది. సాటివారివల్ల సహాయం లభిస్తుంది. కారణం తెలియని అసంతృప్తి మాత్రం మిమ్మల్ని ముందుకు పోకుండా చేస్తూవుంటుంది. తొందరపడి ఎవ్వరికీ ఏవిధమైన వాగ్దానాలుచేయతగిన సమయంకాదు. అనారోగ్యం చేయకపోయినా అలసట, నరముల బలహీనత కనుపిస్తవి. సూర్యస్తోత్రం పారాయణం చేసుకోనటం అన్నివిధాలా మంచిది. 22, 23 లలో అపవాదులు, వృథా ఖర్చులు.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ధైర్యము, సాహసము ఉండటంమంచిదే. కాని, సమయానుకూలంగా పట్టుదలను తగ్గించుకోనటం అవసరం. తరచు ఇతరులతో పోటీ ఏర్పడుతూ ఉంటుంది. చాలా ఉత్సాహంతో ఆరంభించిన పనులు మధ్యలోనిలుపవలసివస్తుంది. స్వల్పకారణాలుకూడా బంధుమిత్రులతో విరోధానికి దారితీయగలవు. ముఖ్యంగా మీ ఆరోగ్యాన్నిగురించి జాగ్రత్తగా ఉండటం అవసరం. వ్యవహారవిషయాలలో అనుకూలసూచనలు కనిపిస్తవి. వృత్తివిషయాలలో ఆడంబరం అధికం. వారాంతంలో ధర్మకార్యాలు నెరవేరుతవి. 25, 26 లలో చోరభయం, వృథా ఆందోళన, అధికారులతో సమావేశం.

* * *

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

మీపైన ఉన్న భారం క్రమంగా తగ్గి క్రొత్త ఆలోచనలకు అవకాశం లభిస్తుంది. ఇంతకుముందు దూరంగావున్న మనుష్యులు కొంతవరకు ఆత్మీయతను చూపిస్తారు. వృత్తి వ్యాపారాలలో ఇంతకు ముందుకన్నా ఉత్సాహం లభిస్తుంది. ఖర్చులుమాత్రం విపరీతంగానే ఉంటవి. లోగడ మిమ్మల్నిగురించి ప్రచారంలోవున్న అపవాదులు తొలగిపోయి సంఘంలో స్థానం లభిస్తుంది. గొప్పపనులయందు ఆసక్తిమాత్రంఉంటుంది. కాని నిర్వహించలేకపోతారు. పిల్లల ఆరోగ్యం గురించి

జాగ్రత్తగా ఉండండి. 20, 21 తేదులలో గౌరవప్రాప్తి, కార్యసిద్ధి, పుణ్యకార్యాలు.

* * *

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

క్రమ క్రమంగా, వృత్తి ఉద్యోగాలలో ఉన్నతస్థితిని పొందగల సమయం. ఇంతకు ముందు ఉన్నటువంటి నిరుత్సాహం తొలగిపోతుంది. ధనాదాయం పెరుగుతుంది. శ్రమకరమైనపనులుకూడా ఈ సమయంలో సులభంగా కనుపిస్తవి. ఇతరులకు సహాయంచేయగలశక్తి, సాహసము లభిస్తవి. కుటుంబంలో శాంతి, సుఖము పొందగలుగుతారు. వాహనములు ఎక్కుట, ఆయుధములు ఉపయోగించుటమొదలయిన సందర్భాలలో జాగ్రత్తగా ఉండండి. బంధుమిత్రులవద్దనుంచి ఎదురుచూస్తున్న వార్తలు సమయంలో అందవు. 20,21,22 లలో అదృష్టసూచనలు, ధనలాభం.

* * *

**వృశ్చికం:**

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి వ్యాపారవిషయాలలో ప్రతిబంధకాలు తొలగిపోయి మార్గం సుముఖంగా కనిపిస్తుంది. గౌరవం లభిస్తుంది. బుద్ధి బలంతో ఎదుటివారిని ఆకర్షించగలుగుతారు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం కొంచెం నిదానంగా చేతికివస్తుంది. అధికారులవల్ల మాట వస్తుందని అనుకోవలసివస్తుంది. కాని, అటువంటిదేమీ ఉండదు. ప్రయాణాలు చేయవలసిరావచ్చు. ఇంతకుముందు ఇతరులకు వాగ్దానాలు ఇచ్చిఉండటంవల్ల శ్రమపడవలసివస్తుంది. పుణ్యకార్యాలు జరుగుతవి. 23,24 లలో అసౌఖ్యసూచనలు, తలవని తలంపుగా ధనవ్యయం.

* * *

**ధనుస్సు :**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా 1)

ప్రయాసమాత్రం అధికంగా ఉండేసమయం. ఓర్పుతో ఎదురుచూస్తూ ఉండటం అవసరం, అనుకున్న ప్రయాణాలకు అభ్యంతరాలువస్తవి. లోగడచేసిన ప్రయత్నాలు ఫలించి ఫలితంలభించేసమయంలో మళ్ళీ మొదటికి పోవలసివస్తుంది. పండితులతో మైత్రి లభిస్తుంది. అనుభవంలో ముఖ్యమైన క్రొత్తవిషయాలు తెలుసుకోగలుగుతారు. మీ నిత్యవ్యవహార, వ్యాపారాదివిషయాలలో ఇతరుల జోక్యంవల్ల అవకతవకలు రాకుండా చూచుకొనండి. వ్యవహార పత్రాలు మొదలయినవి వ్రాయటంలో జాగ్రత్తగా ఉండండి. విష్ణుసహస్రనామ పారాయణవల్ల మనశ్శాంతి లభిస్తుంది. 26, లలో ధనయోగం శుభకార్యాలలో పాల్గొనటం.

* * *

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

ప్రస్తుతం మీకు కొంతవరకు మంచికాలమనే చెప్పవచ్చు. ముఖ్యంగా అధికారులవల్ల అనుకూలత కలుగుతుంది. ఆదాయం ముందుకన్నా బాగుంటుంది. దూరదేశంనుంచి వచ్చే వార్తలు లాభదాయకంగా ఉంటవి, అయితే మీరు అనుకున్నంత ప్రయోజనం కలుగదు. శక్తిసామర్థ్యాలతో గౌరవం చెడకుండా నష్టకష్టాలు రాకుండా చూచుకోగలుగుతారు. వ్యవహార పరిష్కారాలకూ, ధనంపెట్టుబడిపెట్టి పెద్ద పెద్ద పనులు ఆరంభించటానికి అనుకూలమైన కాలం. పిల్లల మూలంగా ఖర్చులు పెరుగుతవి. సుఖసౌఖ్యాలు లభిస్తవి. 23, 24 లలో ధర్మకార్యాలకై ఖర్చులు, అసంతృప్తితో లాభం.

* * *

**కుంభం:**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మీరు గొప్పగా సంపాదిస్తున్నట్లు, ఉన్నతస్థితిలో భోగభాగ్యాలు అనుభవిస్తున్నట్లు, ఇతరులు అనుకొంటారు. అందుకు తగినట్లు ఆడంబరం మాత్రం బాగుంటుంది. అంది వచ్చిన ఫలితం జారిపోయే సూచన లున్నవి. బంధు మిత్రుల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి వస్తుందని అనుకున్న ధనం సమయంలో రాక ఇబ్బందిపడవలసి వస్తుంది. ఆప్త మిత్రుని ఆదరాభిమానాలు లభిస్తవి. వారాంతంలో అకస్మాత్తుగా ఉత్సాహ సూచనలు కనిపిస్తవి. విలువగల వస్తువులు కొంటారు. శుభవార్తలు తెలుస్తవి. 23, 24 లలో అనారోగ్యం, వ్యవహారచింత.

* * *

**మీనం**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ప్రత్యక్షంలో చిక్కులు ఎదురు అవుతున్నా ధైర్యంతో దాటుకుని పోగల్గుతారు. దైవకార్యాలు నెరవేర్చగలుగుతారు. కోర్టు కచేరీలలో పనులు శీఘ్రంగా జరుగకపోయినా మార్గం బాగుంటుంది. వృత్తి వ్యాపారాలలో మీ యోచనలు కార్యరూపంలోనికి వస్తవి. తీర్థయాత్రలు, ధర్మకార్యాలు నెరవేరుతవి. నీచులతో విరోధంరాకుండా చూచుకొనండి. కుటుంబంలోనివారి ఆరోగ్యం గురించి జాగ్రత్తగా చూచుకొనవలసిన సమయం. శిరఃకోశముల యందు బాధ కనిపించగలదు. 25, 26 లలో పిల్లలకు అనారోగ్యం, వృథాకలహప్రసంగాలు.

-దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి,
52/2 గ్లీలాయపురం వీధి, కథ్రెడల్ రోడ్,
మద్రాసు-6.



# చిత్తరువు

ఆరోజు ఆఫీసునుంచి బయటికి వచ్చేసరికి అయిదు దాటింది. బస్సుకోసం చూస్తూ ఉండగా అర్జంటుగా రావలసిందని రమణారావుగారు పంపిన కబురు జ్ఞాపకం వచ్చి వెంటనే టాక్సీ ఎక్కి రాయపురం పోనివ్వమన్నాను.

రమణారావుగారు వయస్సులో నాకంటె పెద్దవారైనప్పటికీ మా ఇద్దరికీ అదోకవిధమైన స్నేహం ఏర్పడింది. ఆయన ఇప్పుడు నాకోసం ఎందుకు కబురుపంపారో నాకు తెలుసు; ఈమధ్యే ఆయన కొన్న ఒక పాత చిత్రపటం దానికి కారణం. రమణారావుగారికి చిత్రపటాలు, శిల్పవిశేషాలు, పాత పుస్తకాలు సేకరించటం అంటే ఇష్టం. వాటినిగురించి నాకు చెప్తూ ఉండేవారు కూడా.

ముఖ్యంగా ఈ చిత్రపటాన్ని గురించి నాకు చాలా చెప్పారు. ఈ పటం నాకు చాలా సాధారణమైనదనిపించింది. కాని రమణారావుగారు అదోక నవాబుల కుటుంబానికి సంబంధించినదని, అది వేసి కనీసం అరవైఏళ్ళయినా అయి ఉంటుందని అన్నారు. ఆ పటం అరవైఏళ్ళలోపు ఉన్న ఒక నవాబు కుర్రవానిది. ఫ్రేము కట్టినప్పటికీ బాగా దుమ్ముకొట్టిపోయి ఉంది. ఆ చిత్రంలో విశేషమైన చారిత్రక విషయాలున్నాయని రమణారావుగారి అభిప్రాయం. అందుచేతనే ఇటువంటివాటిలో ప్రవేశమున్న అవధానిని పిలిపించి పరీక్షించమని కోరారు. అదేమిటో ఇవ్వాళ నాకు చెప్పడానికే ఇంత హడావిడిగా కబురుపంపాడని ఊహించాను.

## గంటి సూర్యప్రకాశరావు

ఇంతలో హార్బర్ దాటి రాయపురంలో ప్రవేశించాను. రమణారావుగారి ఇల్లు సముద్రానికి చాలా దగ్గర. ఆయనకు ఒక కొడుకు తప్ప మరిఎవ్వరూ లేకపోవటంవల్లా, అతను కూడా మరోఊళ్ళో పనిచేయుటంవల్లా ఆ ఇంట్లో ఒంటరిగానే ఉండేవారు. టాక్సీని పంపించేసి తలుపుతట్టాను. రమణారావుగారే వచ్చి తెరిచారు. ఆయన్ని చూడగానే ఎందుచేతనో కలతచెందిఉన్నట్లు కనిపించారు.

ఆయన "రావోయ్! నీకోసమే చూస్తున్నా"నని ఆహ్వానించారు.

"పటం గురించి అవధాని ఏం చెప్పాడండీ?" అని అడిగాను.

"ఇప్పుడంతా దాని గొడవేకదుటోయి! అవధాని దానిసంగతి పూర్తిగా కనుక్కున్నాడు. అది సాహెబ్‌పురంలో ఉండే ఓ చిన్న నవాబువంశానికి సంబంధించినదట. బొమ్మలో మనిషి చిన్నప్పుడే దారుణంగా హత్య చేయబడినట్టు కూడా అవధాని చెప్పాడు. ఇవన్నీ పుస్తకాల్ని చూసి చెప్పాడనుకో. కాని అసలు సంగతేమిటంటే నిన్న రాత్రి చిత్రమైన సంఘటన జరిగింది. అవధానికి కూడా కబురు పంపించాను. కొంతసేపట్లో వస్తా"డంటూ రమణారావుగారు లేచి లోపలికెళ్ళి ఆ పటాన్ని తీసుకొని వచ్చారు. అద్దం తీసివేయబడి ఉంది అది. కొంచెం శుభ్రం కూడా చేయబడి ఉంది. దాన్ని నా చేతి కిస్తూ "నీకేం కనిపిస్తోందో చెప్పు" అన్నారు ఆయన. నేను జాగ్రత్తగా పరిశీలించాను. క్రింది భాగంలో రెండు మూడు చిన్న బొమ్మలు కనిపించాయి. అసలు బొమ్మపైన ఎవరో పిచ్చిగీతలు వేసినట్లనిపించింది.





ఇంకా జాగ్రత్తగా చూడగా రెండు ఆకారాలు గోచరించాయి. మొదటిది శవాలు వేసుకున్నటువంటి దుస్తులు కలదిగా తెలుస్తోంది. మెడచుట్టూ నడుంచుట్టూ కూడా ఉచ్చు వేసినట్లు బొమ్మ గీసి ఉంది. ప్రక్కన ఘోరంగా ముసుగు కప్పుకున్న ఆకారం మరొకటుంది. ఎందుచేతనో నాకు అది భయంకరమని తోచింది.

ఎవరండీ గీసింది బొమ్మల్ని? అనడిగాను,

"అది తెలియదుగాని, నిన్న రాత్రి నిద్ర పట్టక దీన్ని చూస్తూంటే ఈ బొమ్మలు కదిలాయి. నా కళ్ళను నేనే నమ్మలేదు. అవధానికి చెపితే తనేదో తెలుసుకొస్తానని వెళ్ళాడు. సాయంత్రం తప్పకుండా వస్తానన్నాడు. ఆ పటం ఒక మూల ఉర్దూలో ఏవో అక్షరాలు ఉన్నాయని వాటినిబట్టి తెలుసుకోవచ్చన్నాడు... ఇదుగో అతనే వచ్చినట్టున్నాడు."

అవధాని ఒకప్పుడు కవిత్వం వ్రాసేవాడు. ఇప్పుడు అవన్నీ మానేసి సినిమాలకు పత్రికలకూ వ్రాస్తూ ఉంటాడు. రమణరావుగారికి బాగా స్నేహితుడు. ఇటువంటి విషయాలలో మిడిమిడి జ్ఞానం లేకపోలేదు.

"ఏం రావ్ ఎప్పుడొచ్చావ్... చూశావంట రమణరావుగారూ. హా—లో ఓ పత్రిక ఫైలు తిరగేస్తే ఆ శవాలు ఎలా చచ్చాయో తెలిసింది. గొంతుక పిసికేయటమే కాక దాని మీదకూడా దారుణమైన గాయాలుచేసి చంపేశారుటండీ! ఎవరో తెలియలేదుట. పటంలో మూల కనిపించిన ఉర్దూమాటలు ఒకటికి చూపించాను. అతను అవేవో మంత్రాలుగా ఉన్నాయన్నాడు, జలాలుద్దీన్ పైన (శవాలు ... ) ......ప్రయోగించాలిగ ఉందన్నాడు..." అవధాని ఇంకా ఏదో చెప్పబోతూ ఉండగా రమణారావుగారు "ఇప్పుడేంచేద్దాం అంటావు అవధానీ?" అన్నారు.

"ఏం చెయ్యటానికేముందీ? సావేశపురం వందమైళ్లేగా దీని అంతుకనుక్కుంటాను! మంచి వ్యాసం ఒకటి పత్రికకు వ్రాయొచ్చేమో."

రమణారావుగారు దీనికి మొదట ఇష్టపడలేదు, ఆ పటాన్ని తగులపెట్టేసి దాని సంగతి

(88-వ పేజీ చూడండి)



# జీవనగంగ



పురాణం సూర్యప్రకాశరావు

(గత వారం తరువాయి)

"తాతా ఒకవిషయం అడుగుతాను. నీవు తోచిన సమాధానం చెబుతావా?" అన్నాడు మల్లిబాబు.

తాతమీదికి ఎగబాకుతున్న పిల్లల్ని పక్కకి నెట్టుతూ "నేనుమీకు చెప్పగాదా బాబూ. మీ సందేహాలు నేను తీర్చటమా? అన్నాడు వినయంగా.

"నువ్వు చూసిన జీవితంలో నేను ఏపాటి చూశాను తాతా. కాబోతే చదువుకున్నాను కనక ఊహించగలను. ఎంతయినా నీ అనుభవంలో సాటికాదు తాతా."

ముసలితాత మీసాలకిందనించి నవ్వాడు.

లోపల గోడమీద పడుకున్న మంట చెలుగుని చూస్తూ "నీ కష్టాలతో పోల్చదగినవి కాకపోయినా నేనూ ఇలాంటి అన్యాయాలని నా కుటుంబంలో కూడా జరగటం చూశాను. భరించలేకపోయాను. ఫలితం చేసే నలిగిపోసాగాను. అయితే ఇక్కడ అన్యాయం లోకం సానుభూతి పొందుతుంది. కాని అక్కడ అలా కాలేదు. ఆ హత్య చాలా ఘరానాగా జరిగింది. ఎవరూ ఎవర్నీ తప్పు పట్టలేని ధోరణిలో జరిగిపోయింది. ఆడదాని అభిమానం దగ్ధించి ప్రాణంవరకూ ఈ మొగవాడు హత్య చేసుకుంటూ పోతాడు. ఈ దారుణాలు ఎలా అంతం చెయ్యటం? నువ్వు చెప్పు తాతా" అన్నాడు మల్లిబాబు.

"అవును బాబూ, అంతే జరుగుతూంది. ఈ మనసులుమార్చటం కష్టంబాబూ ఏమంచి జరిగినా మీతరం వాళ్ళు చెయ్యాలి. అలా అలా మంచిపద్ధతులు అలవాటు కావాలి. ఆడవాళ్ళు కూడా అందుకు దోహదం చెయ్యాలి" అన్నాడు ముసలి తాత.

మల్లి బాబుకి ఒకప్పుడు అన్న పూర్ణమ్మ అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. ఆమె ఏ తీర్పు అయితే ఇచ్చిందో ఈ ముసలితాత కూడా అదేతీర్పు ఇచ్చాడు. "అంతే తాతా. అదే జరగాలి. ఈ తరం కళ్ళు తెరవాలి." అన్నాడు.

ముసలితాత తన జీవితంలో అనుభవాలని కథలు కథలుగా చెబుతూంటే మల్లి బాబు ఉత్సాహంగా వినసాగాడు. సుఖదుఃఖాల మిళితమైన అతని అనుభవాలు వింటూంటే ఒక మహారచయిత అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. కష్టాలలో ఉన్న వైవిధ్యం సుఖాలలో లేదు. సంసార సమస్యలకి సంబంధించినంతవరకూ ఈ సత్యం ఇంతే. ముసలితాత జీవితంలో అన్నిరకాల రుచులూ అనుభవించాడు. కాని ఆ అనుభవం అంతా వయసులోనే గడిచిపోయింది. కష్టాల వంతు వచ్చేసరికి పెద్ద వయసు వచ్చేసింది. అతను కలలు కన్నదానికి పూర్తిగా విరుద్ధంగానే జరిగిపోయింది. తట్టుకునే శక్తిలేక నలిగి పోతున్నాడు.

"బాబూ బ్రతకటం కష్టమయి, పోనీ చనిపోతే అని అనిపిస్తే అదీ బాధాకరమైన విషయమే అయిపోవాలా. ఈ పిల్లలగతి?"

పిల్లలు! పిల్లలు!! విత్తనాలు చల్లితే మొక్కలు మొలిచినట్టుగా పిల్లలు! తినటానికి తిండి లేకపోయినా, నిలవనీడ లేకపోయినా పిల్లలు! ఒక మితిలేదు. దేముడిచ్చాడంటూ కంటూనే ఉంటారు. కనలేక ప్రాణాలయినా పోగొట్టుకుంటారు. కనటం మానరు. కన్నవాళ్ళని రోజుకో మారయినా 'ఎందుకు పుట్టాడు వెధవ' అని విసుక్కోక మానరు. ప్రేమగా వాళ్ళకి దరిద్రం పంచిపెడతారు. పిల్లాడైనా, పిల్లయినా బ్రతుకు తెరువుకంటె పెళ్ళి ముందు ముఖ్యం. అదయేదాకా ఆరాటం అయిం. తర్వాతజంజాటం. తిట్టుకుంటూతిమ్ముకుంటూ రోజులు గడపటం! ఒకరిద్దరు పిల్లలయితే అందం. తామరతంపరయితే నరకం! ఇంకా నయం. ఏటా ఇద్దర్ని కనేవారు కొద్దిగానే ఉన్నారు. వాళ్ళనే కవలలని ముద్దుగా పిలుస్తారు! మల్లిబాబు నెత్తిబాదుకుంటూ 'అయ్యోరామ!' అనుకున్నాడు.

"దేముడి మీద నమ్మకంతోపాటు మనో నిగ్రహం కూడా పోయిందిబాబూ" అన్నాడు ముసలితాత.

"ఆ రెంటికీ లంకె పెట్టాడు తాత. తాతే కాదు చాలామంది ఆ పనేచేశారు" అని మనసులోనే అనుకున్నాడు మల్లిబాబు.

పిల్లల్ని లోపల్నించి అన్నానికి రమ్మనమని తాత మనమరాలు పిలవటంతో వాళ్ళంతా తాతని విడిచిపెట్టి లోపల చొరబడ్డారు.

తాత గొంతు తగ్గించి "ఆ కంటి అమ్మ పిల్లదాని పెళ్ళి చెయ్యాలని అనుకొంటున్నా బాబూ. కాస్త మంచివాడు, బుద్ధిమంతుడు అయిన కుర్రవాడ్ని మీ ఎరికలో ఎక్కడైనా ఉంటే చూసిపెట్టు బాబూ. పుణ్యం ఉంటుంది. మీ మేలు మర్చిపోలేను." అన్నాడు ప్రాధేయపడే స్వరంతో.

"అలాగే తాతా. ఆ తర్వాత నీ జీవితం. ఈ పిల్లల బ్రతుకు ఎలా?"

"అందుకని దాన్ని..."

అడ్డుపడుతూ "అహా! నా ఉద్దేశం అది కాదు. ఆ తర్వాత ఎలా గడపదల్చుకున్నావో తెలుసుకుందామని అడుగుతున్నా" అన్నాడు మల్లిబాబు.

ముసలితాత "వీధి వీధికీ తిరిగి తిరిపమెత్తుకుని బ్రతుకుతాను నాయనా. అలాగే పిల్లల్ని పోషిస్తాను. శక్తి ఉన్నంతవరకూ అలాగే చేస్తాను. అయినా ఈ విశాలమయిన ప్రపంచంలో ఇలాంటి సంఘటనలు అరుదూ, అపూర్వమూ కాదు. మనసు రాయిచేసుకుంటే ఏ చింతా ఉండదు." అన్నాడు.

ఇక వినలేక మల్లిబాబు లేచి "నీకు చేతనయిన సహాయం చెయ్యటానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను తాతా.!" అని మెల్లగా ఇవతలకి వచ్చి క్షణం ఆలోచించి వెనక్కివచ్చి 'తాతా ఈ డబ్బు దగ్గర వుంచుకో' అని ఓ అయిదురూపాయిల నోటు తీసి అతనిముందు వుంచి అతని అభ్యంతరాన్ని లక్ష్యపెట్టకుండానే చరచరా ఆ వెలుగులోంచి చీకటిలోకి వెళ్ళిపోయాడు.

ముసలితాత గొణుక్కుంటూ చేతికర్ర ఊతంతో లోపలికి వెళ్ళిపోయాడు.

**27**

"ఇది నిజమేనా మల్లి బాబూ?" అంటూ

ఆతృతగా మెట్లు ఎగబ్రాకుతూ వచ్చాడు లక్ష్మణరావు.

మల్లిబాబు గడ్డం చేసుకుంటున్న వాడల్లా కిటికీలోనుంచే చూస్తూ "రండి రండి" అన్నాడు.

లక్ష్మణరావు చేతిసంచీతో వచ్చి కుర్చీలో కూర్చుని "ఎవరో చెప్పారు. ఎవడో అయితే బాధపడి ఊరుకోవాల్సివాడ్నంతే. బాబూరావు ఇంతపని చేశాడని తెలిసేసరికి కనుక్కుందామని వచ్చాను." అన్నాడు టేబిల్ మీద పుస్తకంతో విసురుకుంటూను.

మల్లిబాబు రేజరు గడ్డంమీదనించి తీసి "మీరు విన్నదంతా నిజమే" అన్నాడు.

"అతను రూముకి వస్తున్నాడా?"

"అసలు పత్తా లేకుండా పారిపోతే"

"పిల్ల తాలూకువాళ్ళు కాకబు చెయ్యటంలా?"

"ఆరుగురు బుర్రమీసాలవాళ్లు సాయుధులై ఇక్కడికి వచ్చిపడ్డారు. నేను అప్పుడే అసలువిషయం తెలుసుకోవటం జరిగింది. అతని వూరు, తండ్రిగారిపేరు చెప్పి ఎలాగయినా మంచిగానే ఒప్పించి అతన్ని పట్టుకొమ్మని చెప్పాను. హింసకి పూనుకోవద్దని మరీ మరీ చెప్పాను."

"మంచికిరోజులా తమ్ముడూ! కాస్త ఒళ్లు వదుచెక్కుతుందనే భయంవుంటేనే అన్యాయాలు జరక్కుండా వుంటాయి"

"ఆ మాట మనం చెప్పటం దేనికి? వాళ్లే. లొంగకపోతే లొంగ తీస్తారు."

రేజరు శుభ్రపరుచుకుంటూ "ఇలాంటి వ్యక్తి ప్రభావం నామీదకూడా పడింది. కాని అదృష్టవశాత్తూ, ఉన్న విషయం చెబుతాను. రావుగారు చేసిన తీవ్రమయిన విమర్శతో తెలివి తెచ్చుకొని బయటపడ్డాను" అన్నాడు మల్లిబాబు.

"అవును ఆ విషయం నీ నల్లటి పెదిమం చెబుతున్నాయి"

"అంతేకాదు" అంటూ చొక్కాగుండీలు విప్పి చొక్కా ఎత్తి బోర చూపించాడు. ఎముకలు బయటపడి చాతీ అణిగిపోయివుంది. మెడ కొంకులుబయటపడ్డాయి. "రోజుకి ఎన్ని సిగరెట్లు కాల్చేవాడినో ఓ లెఖ్ఖా జమా లేదు. గుండెలు ఆరిపోయాయి. చివరికి దగ్గుకూడా పట్టుకుంది. నిగ్రహించుకోగలిగాను. ఇప్పుడిప్పుడే కాస్త ఆరోగ్యం కోలుకొంటోంది"

లక్ష్మణరావు దగ్గరగావచ్చి భుజంతడుతూ "చాలాసంతోషం" అన్నాడు.

మల్లిబాబు నవ్వుతూనే "ఒకమారు మీరు చెప్పిన కథ జ్ఞాపకం వస్తోంది." అని మొఖం కడుక్కొందుకు పక్కగదిలోకి వెళ్ళాడు.

లక్ష్మణరావు టీపాయిలోంచి తొంగి చూస్తున్న సినిమాపాటల పుస్తకాన్ని చదువుతూ తుడుచుకుంటూ వస్తూన్న మల్లిబాబుతో ఒక సినిమా చూట్టం ఒక జీవితాన్ని నాశనం చెయ్యడం. సినిమావాళ్ళు టిక్కెట్టు కొనేవాడిలో కక్కుర్తి తీర్చటంకోసం విధిగా ప్రేమని సృష్టిస్తారు. చూసేవాళ్లు కలలు కంటారు." అని ఆపి పుస్తకం యథాస్థానంలో పెట్టేసి "సినిమారంగాన్ని నేను సంకుచితంగా విమర్శిస్తున్నానని అనుకోకుండా ఉంటే ఒక విషయం చెబుతాను. ఈ ప్రేమలేని గాథలు సినిమాకు ఎందుకు పనికిరావు?" అని "ఉన్నత ప్రమాణంతో ఈ భావాన్ని తీసుకుంటే ఫర్వాలేదు. కేవలం కూలికోసం ఇంతటి ఉదాత్తమైన వస్తువుని ఉపయోగించుకోవటం అభినందించవలసిన విషయం కాదు."

"మా పనిమనిషికి ఓ కూతురుంది. దానికి ఇద్దరు తమ్ముళ్లున్నారు. ఒకతను కట్టెల అడితీలో పనిచేస్తున్నాడు. ఒకతను సినిమాహాల్లో గేటుదగ్గిర కాపలా ఉద్యోగం. ఈ ఇద్దరి మేనమామల్లో పిల్ల దానిదృష్టి సినిమాహాల్లో పనిచేసే అతనిమీద ఉంది. తల్లి కట్టెల అడితీలో పనిచేసే వాడికివ్వాలని అనుకొంది. ఆ సినిమాహాల్లో మేనమామంటే ఎందుకు నీకింత మోజు అని అడుగుతే అతను సిగరెట్టు కాలుస్తాట్ట, పాంటు తొడుక్కుంటాట్ట, అన్నిటికంటె ముఖ్యమయిన ఆకర్షణ అతగాడు చూడని సినిమా లేదుట. అతన్ని పెళ్లి చేసుకుంటే ఊరికే సినిమాలు చూడచ్చుట—ఇదీ పిల్లదాని సమాధానం. వాడు తాగుతాడనీ; ముండలముకాకోరనీ తల్లి గోల. ఏమయితేనేం ఒకశుభముహూర్తానఆపిల్ల ఆసినిమామామతో లేచిపోయింది. కొన్నాళ్ళు పోయినతర్వాత నెత్తికొంటూ తల్లి దగ్గరికొచ్చి పడింది. ఏమిటంటే 'ఒగేశాడు. ఇంకో తెత్తో పోయాడు' ఇదీ సమాధానం." అన్నాడు మల్లిబాబు.

"మన యువకుల్లో ప్రతివ్యక్తికీ ఒకముద్ర వేస్తూండటం అలవాటు. అంతకు తప్పించి సంకల్పబలం ఎవరిలోనూ కనిపించటంలేదు. ఇప్పుడు జరుగుతున్న ప్రేమవివాహాలలో చాలావరకూ ఇలాగే జరుగుతున్నాయి. ఒకరకం వ్యామోహంలో, మోజులో లేదా అవసరానికి పెద్ద పెద్ద ఆదర్శాలపేర్లు తలుచుకుంటూ పెళ్ళిళ్ళు చేసుకోవటం, మధ్యలో ఒకళ్ళమీద ఒకళ్ళకి అనుమానాలు, అయిష్టాలూ, తరతరాలుగా జీర్ణించుకుపోయిన ఆహార,ఆచారాదినియమాలు-వాటిల్లో భేదాలనో, బయటివాళ్ళ బాధ సహించలేక బలహీనతకు లొంగిపోయి సంసారంసుఖజీవనసారం చేసుకోలేకపోతున్నారు. సంకల్పబలంతో జరిగే ఏమంచిపనయినా నేను మెచ్చుకుంటాను. ఆసంకల్పశుద్ధి జీవితం చివరికంటా ఉండాలి. అయితే దురదృష్టవశాత్తూ అలాంటి ఆదర్శప్రాయమైన వివాహాలు నేను ఒకటిరెండు చూశానేమో. అంతే."

మల్లిబాబు ఒప్పుకుంటూ "ఇప్పుడీతను పారిపోవటంలో తల్లిదండ్రుల్ని సంఘాన్నీ అన్నిటికంటె మించి తనలోజీర్ణంఅయిపోయి అంతర్గతంగాఉన్న ఒకరకం స్వజాత్యభిమానాన్ని ఎదిరించలేని బలహీనతేగా రహస్యం" అన్నాడు.

మల్లిబాబు బాబూరావు పెట్టెతీసి అందులోనుంచి ఒక ఉత్తరంతీసి లక్ష్మణరావు చేతికిస్తూ "చదవండి. నేనూ ఏదో అనుకున్నానుగాని అసలువిషయం అంతా బోధపడుతుంది. అతగాడు ఇక్కడే ఉన్నాడనుకొని ఆ అభాగ్యురాలు రాసిన ఉత్తరం" అన్నాడు.

లక్ష్మణరావు ఆతృతగా ఉత్తరం విప్పి చదవసాగాడు.

ప్రియమైన బాబూరావుగార్కి,

......మీతో గడిపిందీ చాలా రోజు లయింది. రోజు గడుస్తున్న కొద్దీ నాకు భయంగా ఉంది. ఈ రహస్యం ఎలా దాచుకోవాలో అర్థం కావటం లేదు. ఎలా గూ బయటపడి తీరుతుంది. మీరు ఇచ్చిన వాగ్దానాలను మర్చిపోతున్నారా? నన్ను ఏం చెయ్యదల్చుకున్నారు?... కాదు... నా బాధ కొద్దీ ఇలా రాస్తున్నానంతే... మీరు చాలా మంచివారు... ఎంతో ఉన్నతమైన ఆశయాలు కలవారు. మీరు అలా చెయ్యరు. మన పెళ్ళి ఎప్పుడవుతుందా అని కలలు కంటున్నాను. అది కాస్తా అయిపోతే మన్ని అనే వాళ్ళెవరూ ఉండరు. ఒంట్లో బాగుండటం లేదు. గదిలోంచి ఇవతలకి రావటం లేదు. నిముషం యుగంగా ఉంటూంది. తెలయేసరికి జుట్టు కాస్త తపుకుని, బొట్టు పెట్టుకోకుండా పేరూల కూచుని అనుమానానికి ఆస్కారం లేకుండా నటిస్తున్నా. ఎలా చావటం? మీరు వస్తారనే ఆశవుంది. తప్పకుండా వస్తారు. ఎదురు చూస్తున్నాను. ఈ రాత్రికి వచ్చేస్తే నేను అన్ని ఏర్పాట్లూ చేసుకుని సిద్ధంగా ఉంటాను. కొద్ది తలుపు తీసేవుంచుతాను. తప్పకుండా రావాలిసుమా.

నీ

లత.

లక్ష్మణరావు నిట్టూర్చి ఉత్తరాన్ని మల్లి బాబుకి అందిస్తూ 'అంతా ఎలా ఊహించావో అలాగే జరిగింది' అన్నాడు.

"ఈ ఉత్తరం వచ్చిన మూడురోజులకి వాళ్లు వచ్చి అసలు విషయం చెప్పింతర్వాత ధైర్యం చేసి కవరు చింపాను. ఇదీ ఉత్తరం.

# జీవనగంగ

హృదయం ద్రవించిపోయిందంటే నమ్మండి. ఆ అమ్మాయికి ఈ విషయం తెలుస్తే ఏమయి పోతుంది పాపం."

"ఆమెని ఆమే రక్షించుకోవాలి. గత్యంతరం లేదు" అని లక్ష్మణరావు లేచి కదల బోతుంటె "అంటె మీ ఉద్దేశం?" అన్నాడు మల్లి బాబు.

"సంఘం కారినుంచి స్థయిర్యంగా నిలబడగలదో శక్తి ఆమెకి ఉండాలి. లేకపోతే ఏమయిపోతుందో మనం ఊహించలేం. ఏమయినా కావచ్చు" అన్నాడు లక్ష్మణరావు.

ఈ లోకంలో పూనుకుని ఏదైనా మంచి చెయ్యాలనుకున్న వారికే అన్ని ఇబ్బందులూ వచ్చిపడుతూంటాయి. ముసలితాత పెళ్ళికెదిగిన కూతురు వివాహసమస్య తన కాళ్లను చుట్టుకుంది. దులుపుకు పోగలిగితే ఏ బాధా ఉండదు. ముసలితాత కోరుకోరిచి కోరిన ఆ ఒక్క కోరికా మల్లి బాబు హృదయంలో ఒక పక్క పని చేస్తూనే ఉంది. ఒకరి కొకరు సహకరించక పోతే, ఒకరి కోసం మరొకరు ఎంతో కొంత త్యాగం చెయ్యకపోతే ఈ సమాజం ముందుకుపోదని లక్ష్మణరావు ఎప్పుడూ అంటూనే ఉంటాడు. అయితే ఆ వరాన్వేషణ సాగించటం ఎలా అన్నది సమస్య. మంచివాడని తాత ఒకడ్ని తెచ్చి కూతుర్ని అప్పచెబుతే అతగాడు చేసినపనికి

తాత ఇప్పటికి పోయిన కూతుర్ని తలుచుకొని వెళ్ళివెళ్ళి ఏడుస్తూనే ఉంటాడు. ఇతనికి నీకూతుర్నికిచ్చి చెయ్యి తాతా అని తను ఒకడ్ని తీసుకుపోతే అతనూ అంతే చేస్తే ఆజన్మాంతం ఆపిల్ల తన ఉసురునిపడి ఏడవదూ?

ఒకనాడు మధ్యాహ్నం మల్లి బాబు హోటలు మెట్లు ఎక్కబోతుంటే ఒక ముసలి వ్యక్తి వంగిపోయిననడుం ఒక చేతో పట్టుకుని 'ఆకలి వేసోంది నాయనా. ఒక కానీ ఉంటే ఇయ్యవూ?' అంటూ అడ్డంపడ్డాడు.

"డేనికి తాతా కానీ?" అన్నాడు మల్లి బాబు అతని మాటలు వినబడక.

"ఆకలేసోంది బాబూ".

"అయితే నాతో వచ్చి భోజనం చేస్తావా?" అన్నాడు మల్లి బాబు.

ముసలితాత సంతోషంగా "అంతకంటేనా" అన్నాడు.

ఇద్దరూ టేబులు ముందు కూర్చున్నారు. తాత తనకథ చెప్పుకుపోతున్నాడు. సర్వరు విస్తరివేసి వడ్డించబోతుంటే ఒక కాకినిక్కరు తొడుక్కున్న ఇరవై సంవత్సరాల యువకుడు తాత ఎదురుగా వచ్చి నిలబడి "ఏవిటి నాన్నా ఇది. ఎన్నిసార్లు చెప్పాను నీకు. ఈ అడుక్కోవటం మానమంటే మానవా?" అంటూ కన్నీరు గ్రుక్కుకుంటూ నిలబడిపోయాడు.

తాత తలవంచుకునే 'నా ఇష్టం. నాకు ఇలా అడుక్కోవటమే బాగుంటుంది' అంటూ గొణిగాడు.

యువకుడు మల్లి బాబువైపు తిరిగి "గతి

లేకపోతే అడుక్కుతిన్న రోజులూ ఉన్నాయి. నేను పెద్దవాణ్ణయి వాళ్ళకాళ్ళూ వీళ్ళకాళ్ళూ పట్టుకుని ఫాక్టరీలో చేరాను. మంచి పని నేర్చుకున్నాను. రేపోమాపో సింధియాలో చేరబోతున్నాను. డబ్బుకు లోటు ఉండదు. అడుక్కోవటం మానమంటే నాలుగురోజులు ఉన్నట్టేఉండి అయిదో నాడు వీధులంబడి పడతాడు. ఎందుకొచ్చిన పాటు చెప్పండి. పెదవయసులో నెత్తిన పెట్టుకుని నే చూసుకుంటానంటేనిగా. గతి లేక ఒకప్పుడు అడుక్కున్నాంగాని అదొక వృత్తా బాబూ. ఏం బ్రతుకది" అన్నాడు. మీరైనా చెప్పండి అన్నట్టుగా.

మల్లిబాబు తాతవైపు తిరిగి "వింటున్నావా తాతా. సరిలే. ముందు భోజనం పూర్తి కానీ. ఆతర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు. యువకుడు ఆ పక్కనే మాట్లాడకుండా కూర్చున్నాడు. అతనేదో మాట్లాడబోతే మల్లిబాబు వారించాడు సౌజ్ఞతో.

తాతకు విస్తరి ముందు కూర్చోబోయేప్పుడున్నంత ఉత్సాహం ఇప్పుడు లేదు. అతను మధ్య మధ్య సిగ్గుపడుతూ కొడుకు వైపు చూడటం మల్లిబాబు గమనించక పోలేదు.

భోజనం పూర్తయి ఇద్దరూ చేతులు కడుక్కొని ఇవతలకు వచ్చింతర్వాత "అయితే తాతా ఇకమీదటయినా నీ కొడుకు మాట వింటావా?" అన్నాడు.

తాత తల వంచుకునే "వాడిమీద ఆధారపడకుండా నేనే బ్రతకటం తప్పా?" అన్నాడు.

కొడుకు ముందుకు వచ్చి "అలా ఎన్నాళ్ళని తిరగ్గలవో చెప్పు పోనీ. ఆ తర్వాతైనా నేను నిన్ను చూడవద్దూ. అయినా ఇదేం బ్రతుకు నాన్నా, అడుక్కునే బ్రతుకూ ఒక బ్రతుకే" అన్నాడు.

"ఏం...ఎందుకు కాదు."?

మల్లిబాబు కల్పించుకుని "కాదు తాతా. అడుక్కు తినటం మంచిపని కాదు. గతిలేని వాళ్ళే అలా చేస్తారు. చూస్తే నీకది అలవాటయినట్టుంది" అన్నాడు.

"అలా చెప్పండి బాబూ" అన్నాడు యువకుడు ఉత్సాహంగా.

"అలాగేలేరా అబ్బాయి. ఇక మీదట ఇలా చెయ్యనులే" అని ఒప్పుకున్నాడు తాత ఎట్టకేలకు.

"ఇలా చాలామార్లు చెప్పావు. ఇక్కడ పెద్దమనిషి ముందు అదుగో ఆ దేవుడిపటం ముందు ప్రమాణం చేస్తే నమ్ముతాను—" అన్నాడు యువకుడు.

ముసలతను ప్రమాణం చేశాడు. కొడుకు తండ్రిని గట్టిగా కౌగలించుకొని ఒకచెయ్యి పట్టుకొని 'వస్తాను బాబూ' అని మల్లిబాబు దగ్గర సెలవు తీసుకొని తండ్రిని పొదివి పట్టుకొని తీసుకుపోయాడు.

"మీరు విచిత్రమైన మనుషులు సార్" అంటూ దగ్గరకు వచ్చాడు వంటపెద్ద.

ప్రశ్నార్థకంగా మల్లిబాబు చూస్తుంటే— "ఇలాటి అడుక్కుతినే వాళ్ళందర్నీ నమ్ముతారేం సార్. ఆనాడు పర్వరుకు రూపాయి ఇచ్చారు. వాడు తిరిగి ఇచ్చాడా సార్?" అన్నాడు వంటపెద్ద.

ఇంతట్లో లోపల్నించి పిలుపురావటంతో అతను అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

మల్లిబాబు కదలబోతుంటే హోటలు యజమాని దగ్గరకు వచ్చి సిగ్గుపడుతూ ముసిముసిగా నవ్వుతూ "రేపు నా మేరేజి సార్" అన్నాడు చేతులు నలుపుకుంటూను.

మల్లిబాబు ఆశ్చర్యంగా "ఇంత వరకూ మీకు పెళ్ళి కాలేదా?" అన్నాడు.

"లేదు సార్. రేపు మధ్యాహ్నం మీ బోటి పెద్దలకు కొందరికి విందు చెయ్యాలని ఉంది సార్. తప్పక రావాలి" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

'అలాగే' అని మల్లిబాబు నేరుగా రూముకు వెళ్ళిపోయాడు. ఆ పూట భోజనం అతనికి అంతగా రుచించలేదు.

సాయంత్రం చల్లబడింతర్వాత లక్ష్మణరావు జ్ఞాపకం వస్తే వాళ్ళింటికి వెళ్ళాడు. రాధ టిఫిన్ తెచ్చిపెట్టింది. జానకమ్మ తన

---

### అండజం

తెలుగు పీరియడ్ జరుగుతోంది.

మేష్టారు—'అండజం' అంటే ఏమిట్రా రామూ?

రా—గుడ్డునుంచి పుట్టినదన్నమాట అండీ.

మే—అంటే ఏమిట్రా గోపాల్?

గో—పక్షీ అండీ.

మే—ఇంకోటి చెప్పరా సుబ్బారావ్.

సు—పామండీ

కిష్టయ్య—మేష్టారండీ గాడిద మాత్రం అండజం కాకూడదాండీ?

మే—నా విషయాలు మనమే నిర్ణయించుకోవడం మంచిది.

మందలపర్తి భుజంగరావు—(భీమవరం)

---

వంటకు సాలును కజ్జికాయలు తెచ్చి మల్లి బాబు నోటి మొత్తుకుంటున్నా వినిపించు కోకుండా ప్లేటులో వేసింది. మల్లిబాబు అవస్థ చూసి పిల్లలు నవ్వుతుంటే రాధ వాళ్లను మందలిస్తూంది.

లక్ష్మణరావు "మా రాధ చేతి వంట నువ్వు రుచి చూడలేదుగాని ఎంత బాగుంటుందను కున్నావు తమ్ముడూ, అద్భుతం! గొంతుక్కి పట్టుకుపోతుంది రుచి" అంటూంటే—

రాధ అడ్డంపడుతూ "ఎంతైనా నిన్ను మెప్పించగలమా బావా. వంట తెలిసిన మొగవాళ్ళని మెప్పించటం ఎవరితరమూ కాదని పెద్దలు చెప్పనే చెప్పారు. నువ్వు నన్ను వెక్కిరించనక్కర్లేదు" అంది కోపం నటిస్తూను.

"మా రాధమ్మ కోపం బాగా నటిస్తుంది" అంది జానకమ్మ.

"మనం అంతా కలిసి ఒక నాటకం వేస్తే ఎలాగుంటుంది" అన్నాడు లక్ష్మణరావు ఉన్నట్టుండి.

"పేరు చెప్పకుండా నాటకం అంటే ఎలా?" అంది రాధ.

లక్ష్మణరావు వెనక్కి జారగిలబడి ఆలోచిస్తున్నట్టుగా పై చూపులు చూస్తూ "పేరు లేని నాటకం. మనం నటులం. గోడలూ, తలుపులూ ప్రేక్షకులుగా భావించి మనం ఆడాలి. నేను హీరోను, మా జానకమ్మ హీరోయిన్."

జానకమ్మ ముఖం సిగ్గుతో ఎరుపు చేసు కుంటూ "పోండి మీదంతా వేళాకోళం" అని లోపలికి వెళ్లిపోయింది.

"అయిందీ. తమ్ముడూ నాటకం తగులడిం దోయ్. అసలు మన తెలుగుదేశంలో నాటక కళ ఇందుకే తగులబడిందోయ్. సంసార స్త్రీ

# జీవనగంగ

స్టేజిమీదకు రావటం తప్పనుకుంటుంటే సానివాళ్లు ముందుకువచ్చి ప్రోత్సాహం ఇస్తున్నారు. వాళ్ళు కళారాధకులయ్యారు. మనం కేవలం చూసి ఆనందించేవాళ్ళ మయాం. వాళ్ళను తేలిగ్గా తీసిపారే స్తూంటాం."

హాస్యంలోంచి విషయం గంభీరస్వరూపం దాలుస్తుంటే లక్ష్మణరావు ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు. అతను చూసిన నాటకాలూ, చదివిన నాటకాలూ కథలతోసహా చెప్పుకుపోతున్నాడు. నటకుల జీవితాలతో సహా చెబుతున్నాడు.

విషయం విసుగ్గాలేదు కాబోలు మంత్ర ముగ్ధులయినట్టుగా ఆలకిస్తున్నారు అంతాను.

రాత్రి పదిగంటలవేళ ఆలస్యంగా భోజనం చేసి నేరుగా ఇంటికిపోవటం ఇష్టంలేక ఆలోచిస్తూ ఊరిబయటకు నడిచాడు మల్లి బాబు. సుదీర్ఘంగా ఒక జీవితంలా ఉన్న గతుకులబాటవెంట మెల్లగా నడచి వెళు తున్నాడు. వీధివార దీపాలు చాలా ఎడం ఎడంగా ఉన్నాయి. ఉన్న వదిపాకలూ అక్కడా అక్కడా చెదురువాటుగా ఉన్నాయి. కొంతదూరం వెళ్లి అతను వెనక్కి తిరిగాడు. ఆ చీకటిలో పాకల వెన కాలనుంచి కుక్కల ఏడుపు వినిపిస్తోంది. చీకటి ముద్దల్లా చెట్లపొదలు గాలికి తల కు జంయ్‌మంటూ మూలుగుతున్నాయి. ఆకా శంలో కూడా నక్షత్రాలు అక్కడా అక్కడా మెరుస్తున్నాయి.

పరధ్యానంగా ఉన్న మల్లిబాబుకు ఒక పొద చాటునించి అయిదుగురు బలిష్టులు వచ్చి చుట్టుముట్టారు. అతని రెక్కలు రెండూ వెళ్లపెళా మన్నాయి. మల్లిబాబు బాధగా మూలుగుతూ "నాదగ్గర ఏమీలేదు. ఉంటే తీసుకుపోండి" అన్నాడు. అతని శరీరం నిలు వెల్లా వణికిపోతూంది. ఒక బుర్రమీసాల వ్యక్తి ఎదురుగుండా వచ్చి చొక్కా పుచ్చు కున్నాడు.

ఆ మసక వెలుర్లో కూడా ఆ వ్యక్తి బంతు ల్లాటి కళ్ళు బయటికి భీకరంగా పొడుచుకు వచ్చి నిప్పులు చెరుగుతూ "చెప్పు. ఆ వెధవ ఎక్కడికి పోయాడో చెప్పు" అని గుంజ సాగాడు.

మల్లిబాబు బుర్ర పూర్తిగా మొద్దుబారి పోయిందేమో అతను ఆలోచించకుండానే "ఎవరు పోవటం?" అన్నాడు.

"ఇదో నాటకం" అంటూ వెనకనుంచి ఓ గొంతు వినిపించి నడుంమీద ఒక బలమైన దెబ్బ పడింది.

మల్లిబాబు నిలవలేక కిందకు జారిపోతుంటే వెనక ఇద్దరూ నిలబెట్టి "చెప్పరా. ఆ బాబూ రావు. నీ రూమ్ మేటు" అంటూ హుంక రించారు.

మల్లిబాబు బాధతో ముఖం చిట్లిస్తూ "ఎందుకలా బాధ పెడతారు. అతను ఎక్క డికి వెళ్ళాడో నాకు తెలిసింది చెప్పానుగా. అంతకు తప్పించి నాకేమీ తెలియదు" అన్నాడు.

"అబద్ధం చెప్పావు. నీవూ అతనూ లాలూచీ అయి చేసిన పనేఇది. అతను ఎక్క డికి వెళ్లిందీ నీకు తెలియకుండా ఉంటుందా.? ఊ చెప్పు;" రెక్కలు మళ్ళీ విరిగాయి.

"అయితే అతనికి నిడదవోలు కాదా?"

"నువ్వు నటిస్తున్నావు. నిజం చెప్పు. వాడిది నిడదవోలు కాదు. ఆ ఊరంతా గాలించాం."

"అయితే నాకు తెలియదు. నన్ను వదలండి" అంటూ విదిలించుకోబోయి విఫలుడయి మల్లిబాబు కళ్ళు తిరిగి వాలిపోతుంటే "చూస్తారేవిట్రా" అని ఎవరో అనటం అతనికి వినిపించింది. ఆవెనకనే తలమీద బలమైన దెబ్బపడి అతను స్పృహ తప్పిపోయాడు. నుదుటి నుంచి కారే రక్తం కాల్వలుకట్టింది. రోడ్డువార ఒరిగిపోయాడు.

అతను తిరిగి స్పృహవచ్చి కళ్ళు తెరిచేసరికి వీధికుక్కలు చుట్టూ చేరి అతన్ని వాసన చూస్తున్నాయి. ఒళ్ళంతా పుండులా సలుపుతుంటే వాటిని అదిలించబోయి చేతులు లేవక పెద్దగా మూలిగాడు. కుక్కలు దూరంగా తప్పుకుని నిలబడి చోద్యం చూడసాగాయి. వెల్లకిలా పడివున్న అతని ముఖానికి అనంతమైన ఆకాశం తప్పించి మరేవీ కనిపించటం లేదు కుక్కల అలికిడి వినిపిస్తోంది. తల పగిలిపోయే పోటు.

మల్లిబాబు ప్రయత్నం మీద లేవబోయి మైలురాయి తప్పున తగిలి పుండుకేగి పడిపోయాడు. మైలురాయి అంచు చీకట్లో నల్లబడిపోయింది. దుమ్ము నెత్తురుతో తడిసి అతని జుట్టుకు అంటుకుపోయింది.

అతనికి తిరిగి మెలకువ వచ్చేసరికి అతని కళ్ళకు చూరుమీంచి వ్రేలాడుతున్న సైకిలు టైరు ఒకటి కనిపించింది. వెంటనే తెలివొచ్చింది. తెలివొచ్చింది. అన్నగొంతు వినిపించింది. అతను తల పక్కకు తిప్పబోయి విఫలుడయి మూలుగుతూంటే ఒక ముసలి ముఖం మీదికి ఒరిగి "ఎలా ఉంది బాబూ! అంది.

మల్లిబాబు గుర్తుపట్టి 'నువ్వా తాతా' అన్నాడు.

'ఆనాడు ఒకపూట మీతో భోజనం చేశాను. గుర్తుపట్టారా బాబూ' అన్నాడు తాత.

మల్లిబాబు అవునన్నట్టుగా తలవూపాడు. తాత కొడుకు పక్కన వచ్చి కూర్చుని 'డాక్టరు వచ్చి కట్టుకట్టాడు. మీ జేబులో డైరీతీసి ఆ లక్ష్మణరావుగారింటికి ఇప్పుడే కబురుచేశాను. ఈసరికి వాళ్లు వస్తూంటారు" అన్నాడు.

మల్లిబాబు అయిష్టంగా "ఎంత పని చేశారు?" అన్నాడు.

"ఎవరుబాబూ కొట్టింది దొంగలా?" అని అడిగాడు యువకుడు.

"కాదుకాదు. అదంతా ఒక పెద్దకథ. ఇప్పుడు చెప్పలేను" అన్నాడు అతి అతి నీరసంగా.

ముసలయ్య మీదికి వంగి "బాధగా ఉందా బాబూ?" అన్నాడు.

మల్లిబాబు వాచిఉన్న తలమీద చేతులు వేసుకొని ఉబ్బరించిఉన్న నరాలను తడుముకుంటూ 'మీ మేలుమరిచిపోలేను' అన్నాడు.

"ఎంతమాటన్నారు బాబూ?" అన్నమాట ఆ ఇద్దరి నోటివెంటా వచ్చింది.

## 29

మధ్యాహ్నం రెండుదాటేసరికి మల్లిబాబు నోరువిప్పి మంచినీళ్ళు అన్నాడు. ఆ తర్వాత రెండునిమిషాలకుఅతనినోటిముందుకు ఒక గాజుగ్లాసు వచ్చింది. మల్లిబాబు లేచి వెనకపట్టీకి జారబడి నోరు తెరిచాడు. మంచినీళ్ళు కొద్దిగా అతని గొంతులో పడ్డాయి. గాజులసవ్వడి వినిపించి మండుతున్న కళ్ళను తెరవలేక 'జానకమ్మగారూ' అన్నాడు.

'కాదు నేను' అంది రాధ.

"ఇప్పుడు టైము ఎంతవుతుంది?"

"రెండు దాటింది."

"లక్ష్మణరావుగారు ఏంచేస్తున్నారు?"

"మీరు ఎక్కువగా మాట్లాడకండి. పడుకోండి" అంది రాధ.

లక్ష్మణరావు గదిలోకి వస్తూనే "విషయం ఏవిటి మల్లిబాబూ" అని మంచంవార వచ్చి కూర్చుని 'ఒద్దులే. తర్వాత చెబుదువుగాని' అన్నాడు రాధ వారించటం గమనించి.

మల్లిబాబు నవ్వుతూ "నేను గ్రహించాను. రాధగారు మిమ్మల్ని వారించారనుకుంటాను" అన్నాడు.

"అమ్మదొంగా" అంటూ పెద్దగా నవ్వేడు లక్ష్మణరావు. జానకమ్మ పక్కనవచ్చి నిలబడి మెల్లగా "ఎలాగుంది?" అంది.

లక్ష్మణరావు 'ప్చ్' అంటూ పెద్దగా ఛీత్కారంచేసి 'మాట్లాడకు రాధ కోప్పడుతుంది' అన్నాడు.

రాధ కోపంగా 'నీదంతా వేళాకోళం' అంటూ బయటికి వెళ్ళిపోయింది.

"అదికాదు తమ్ముడూ—అమృతాంజనం బాగా పట్టించినట్టున్నావే—అసలువిషయం ఏమిటి? దొంగలు గాయపరిచారా?"

మల్లిబాబు జరిగిందంతా చెప్పాడు. భయంకరమైన ఆ దృశ్యాలు మెదిలి అతనికి ముచ్చెమటలూ పోశాయి.

లక్ష్మణరావులో అంతకుముందున్న హాస్యమంతా చచ్చిపోయి నిర్విణ్ణుడై వినసాగాడు. రాధ, జానకమ్మ, గుండెలమీద చేతులువేసుకుని భయంభయంగా ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకున్నారు.

లక్ష్మణరావు అంతావిని "ఇది చెప్పటా

# జీవనగంగ

నికి అనువైన సమయం కాదుగాని నిన్ను కొద్దిగట్టిగానే చివాట్లు పెట్టేవాడ్ని" అన్నాడు.

సాయంత్రం ఎర్రబడింది. మల్లి బాబు రాధ కిటికీవారకూర్చుని పుస్తకం చదువుతూండటం గమనించి "ఒక ఉపకారం చేసి పెడతారా?" అన్నాడు. ఆమె పుస్తకం మూసి దగ్గరగావచ్చి "పిలిచారా" అంది.

"చిన్న సహాయం చేసి పెట్టండి. ఒక కాగితం తీసుకుని రండి. చిన్న ఉత్తరం రాసిపెడుదురుగాని" అన్నాడు.

ఆమె కాగితం కలం పుచ్చుకుని మంచం వార కుర్చీలో కూర్చుని 'చెప్పండి' అంది.

'నాన్నగారికి నమస్కరించి వ్రాయునది- 'ఆగిపోయి'...వద్దు-వద్దు.ప్రియమైన... తమ్ముడిని ఆశీర్వదించి వ్రాయునది- అని రాయండి. కాకారా? తమ్ముడూ మీరు ముగ్గురూ కులాసాగా ఉన్నారా? మీకు ఈ సరికి కొత్తఅమ్మ వచ్చి ఉంటుంది. కొత్త అమ్మ మిమ్మల్ని బాగా చూస్తుందికదూ. మంచి మంచి కథలు చెబుతూందకదూ. నువ్వు బాగా చదువుకుంటున్నావా? మీకు మంచి మంచి ఆటవస్తువులు పట్టుకొస్తాను ఈ సారి వచ్చినప్పుడు. ఒక కార్డుమీద- నీ దస్తూరీ చూడాలని ఉంది- రాస్తావుకదూ? ఈ ఉత్తరం ఎవరికీ చూపించకేం!-"చాలు. ఆ ఉత్తరం పోస్టు చేయించే ఏర్పాటు చేయించండి."

"ఇంతేనా?" అంది రాధ.

మల్లి బాబు ఆయాసంగా నుదుటి చెమట ఒత్తుకుంటూ 'ఎడ్రసు రాశారా?' అన్నాడు.

"ఆ రాశాను".

"అయితే ఆ ఉత్తరం పోస్టుచేస్తారా?"

రాధ అయోమయంగా చూస్తూ "అంటే" అంది.

"వద్దులెండి. ఆ ఉత్తరం చించెయ్యండి. పోస్టుచెయ్యకండి" అన్నాడు మల్లి బాబు.

"మీరు తెలిసే మాట్లాడుతున్నారా?" అంది రాధ.

"తెలిసే మాట్లాడుతున్నాను. నేను ఉండి ఉండి ఇలాంటి బలహీనమైన పనులే చేస్తూంటాను" అన్నాడు మల్లిబాబు.

రాధ ఉత్తరం చింపుతుంటే 'నా హృదయాన్నే చింపుతూన్నట్టుంది' అంటూ గొణుక్కున్నాడు మల్లి బాబు.

బయట వీధిలోంచి వినసొంపుగా మాత్ ఆర్గన్ వినిపిస్తోంది. ఎదురుగా కిటికీలోంచి ఎర్ర బొట్టతామర పువ్వులు అందంగా కదులుతున్నాయి. సన్నజాజి కిటికీలోంచి తొంగి చూస్తూంది.

**ఉమ్మణరావు కి. యింతపడ్కి వెంటపెట్టు**

వని లోపలికి ప్రవేశించాడు. మల్లిబాబు అతన్నిచూసి మర్యాదగా నవ్వి కుర్చీ చూపించి 'చూసిపోదామని వచ్చారా?' అన్నాడు.

ఆ యువకుడు నవ్వి "అవునుసార్. ఎలా ఉన్నారు?" అన్నాడు.

"దెబ్బ తగిలిననాటికంటే ఒళ్ళంతా బరువుగావుంది. ఫర్వాలేదు. పది పదిహేను రోజుల్లో తగ్గిపోవచ్చు."

యువకుడు వినయంగా ఒదిగి కూర్చుని "అసలు విషయం ఏమిటండీ? దొంగలు పడ్డారా?" అని అడిగాడు.

లక్ష్మణరావు ముందుకువచ్చి "చెడ్డచెలిమి ఫలితం" అన్నాడు.

మల్లిబాబు యువకుడ్ని పరిచయంచేశాడు. లక్ష్మణరావు చనువుగా యువకుడ్ని భుజం తడుతూ "వృద్ధిలోకి వచ్చి చీకూ-చింతా లేకుండా జీవించండి. ఆశీర్వదిస్తున్నాను" అన్నాడు.

మల్లిబాబు "వీరు సింధియాలోనే పని చేస్తున్నారు. వీరినిగురించి మీరు ముందు ముందు తెలుసుకుంటారులెండి. మీరూ అక్కడే చేరతానని చెప్పారు?" అన్నాడు.

"ఆర్డర్లు రావాలి. తాత... కాదు నాన్న-తాత అనే అలవాటయిపోయింది సుమండీ. మీ ఆరోగ్యం తెలుసుకుని రమ్మన్నాడు. నాకూ ఆత్రుతగానే ఉంది. ఇక వెళ్తాను సార్" అని యువకుడు లేవబోతుంటే—

"మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలని అనుకుంటున్నాను. ఎప్పుడు కలుసుకుందాం?"

యువకుడు 'మీకు ఎప్పుడు తీరిగ్గాఉంటే అప్పుడు వస్తాను. చెప్పండి'... అన్నాడు వినయంగా.

బయట చీకటిపడుతూంది.

రాధ మందు ఇవ్వటానికి లోపలికి రాబోయి ఈ అపరిచిత వ్యక్తిని చూసి వెనక్కి వెళ్ళిపోయింది.

'సరే ఒచ్చే ఆదివారం కలుసుకుందాం' అన్నాడు మల్లిబాబు.

సెలవు తీసుకుని యువకుడుకదలబోతుంటే "అది సరేగాని ఇంతకు మీపేరు చెప్పారు కారు" అన్నాడు మల్లిబాబు మంచంమీద అనుకూలంగా సర్దుకుంటూను.

యువకుడు ఆగి "నాకుఒక పేరుకాదండీ. చాలా పేర్లు ఉన్నాయి. నాన్నమటుకు 'కృష్ణా' అని పిలుస్తాడు. చుట్టాలు తలోక రకంగా పిలుస్తూంటారు. మీరూ అలాగే పిలవండి" అన్నాడు.

"నాకు తాతపెట్టినపేరే బాగుంది. నేనూ అలాగే పిలుస్తాను" అన్నాడు మల్లిబాబు.

"మా మల్లిబాబు తరఫున నేను మీకు పిడోక్కలు ఇస్తాను" అంటూ లక్ష్మణరావు నవ్వుకుంటూన్న యువకుని వీధివరకూ అనుసరించాడు.

లక్ష్మణరావు గదిలోకివస్తూ "ఈ రోజులు కష్టపడి జీవించేవారికోయ్. సోమరిపోతుల్లాగా ఒళ్లు కదలని ఉద్యోగాలు కావాలనుకునేవాళ్లు ఎదుగూ బొదుగూ లేకుండా అడుగునే ఉండిపోతారు" అంటూంటే రాధ ఇచ్చిన మందుపుచ్చుకుని మల్లిబాబు 'నిజం! నిజం' అన్నాడు.

"ప్రతివాడూ గుమాస్తా కావటానికైనా ఇష్టపడతాడుగాని శరీరశ్రమకు సంబంధించిన ఉద్యోగమన్నా కాస్త గుడ్డలు మసిబారే ఉద్యోగమన్నా నామోషీ పడతారు. మా దూరపు చుట్టం ఒకతను ఉద్యోగం కావాలంటూ పీకమీదకువచ్చి కూర్చుంటే సింధియాలో చిన్న ఉద్యోగంలో వేయించాను. వృద్ధిలోకి వచ్చే అవకాశాలు అక్కడబాగా ఉన్నాయని అలా చేశాను. నాలుగోనాడు నాతో చెప్పిపెట్టకుండా పారిపోయి ఓ ఉత్తరం రాశాడు. 'ఉద్యోగమంటే గౌరవమయిందనుకున్నానుగాని ఇలా కూలీపని అని అనుకోలేదు. బట్టలు మాపుకునే ఉద్యోగం నే చెయ్యను నాకూ పరువూ మర్యాదా వుంది' అని రాశాడు. అతని దృష్టిలో పరువూ మర్యాదకూ నిర్వచనాలు అవి."

"ఈ యువకుడు ఎలా పరిచయమయిందీ మీకు చెప్పానుగా. అతన్ని చూస్తే నాకు చాలా అభిమానంగా ఉంటుంది. అడుక్కుతినే కుటుంబంలోంచి కష్టపడి పనిపాటూ, నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకుని వృద్ధిలోకివచ్చాడు. ఈ కుర్రవాడ్ని ఓకంట కనిపెడుతూఉండండి" అన్నాడు మల్లిబాబు.

"ఏమిటి అసలు విశేషం?"

మల్లిబాబు గంపెడు పిల్లలతో సతమతమవుతూన్న ముసలితాత కథఅంతాచెప్పి "ఆ కుటుంబపు బాధ్యత కొంత నేను నెత్తిన వేసుకున్నాను" అన్నాడు.

రాధ ఈ కథంతా వింటూనే ఉంది కాఫీలు లోపలికివస్తూ "అయితే మీరూ మా బావలాగానే చిక్కుల్లో పడుతున్నారన్నమాట" అంది.

"పడకపోతే ఎలా? అనుభవం మనిషిని పెంచుతుంది కాని వయసుకాదుగా. నువ్వు మంచిబాధ్యతే నెత్తిన వేసుకున్నావు ధైర్యంగా నిర్వహించు భాయీ. నేనున్నాను."

బయటనించి పేపరబ్బాయి పిలిచాడు. రాధవెళ్ళి పేపరు తీసుకొచ్చింది. లక్ష్మణరావు అందిపుచ్చుకుని పతాకశీర్షికను పెద్దగాచదివి వ్యాఖ్యానించటం మొదలుపెట్టాడు. పేపరురాగానే నలుగురూ చుట్టూ చేరుతారు. తలోకరూ తలోపేజీ పంచుకోవటమో ఒకరు పెద్దగా చదువుతుంటే మిగతావారు వినటమో జరుగుతూంటుంది. ఆవేళకు పత్రికరావటం ఆలస్యం అయితే అందరూ చిరాకు పడిపోతారు. ఆ పేపరబ్బాయిమీద విరుచుకుపడతారు. మొదట్లో లక్ష్మణరావు ఒక్కడే చదువుతూంటేవాడు. ఆ తర్వాత జానకమ్మ చదవటం అలవాటు చేసుకుంది. ఆమె తీరిగ్గా ఉన్నప్పుడే పేపరు చదువుకుంటుంది. సాధారణంగా పేపరు వచ్చేవేళకు ఆమె తీరిగ్గానేఉంటుంది. అందువల్ల ఆద్యంతం పూర్తిగా చదివి ఆవిడ అభిప్రాయాలను ఆవిడ భర్తతో వెలిబుచ్చుతూంటుంది. సర్వసాధారణంగా వారిద్దరి ఆలోచనలూ ఒకేరీతిని ఉంటాయి. ఆ తర్వాత రామచంద్రం అలవాటు చేసుకున్నాడు. చదవటమయితే చదువుతాడు గాని అంతలోతుగా పోడు. రాధ వచ్చింతర్వాత దినపత్రిక ఒక జీవితావసరం అనే భావం అందరిలోనూ బలంగా నాటుకుపోయింది. 'మన పత్రికలు యూరప్ దేశాల వార్తలకు ఇస్తున్న ప్రాధాన్యం ఆసియా దేశాల వార్తలకు ఇవ్వకపోవటం అంత బాగులేదు. ఆసియాలో అనేక చిన్న రాజ్యాలు [illegible]యి. అవి భౌగోళికంగా చిన్నవ[illegible] రాజకీయంగా విశేషమయిన ప్రాధాన్యం ఉన్నదేశాలు. ఆ విషయం భారతప్రభుత్వం గుర్తించింది. మన పత్రికలుమటుకు అప్పుడప్పుడు అరుదుగా ఈ దేశాలకు సంబంధించిన వార్తలు ప్రచురిస్తూంటాయి. అది సరయిన దృష్టికాదు' అని ఆమె అభిప్రాయ పడుతూంటుంది. సహజంగా అందరినీ ఆకర్షించే అంతర్జాతీయ వార్తలలో విశేషమేదైనా ఉంటే మటుకు వారిముఖంమీద నరాలు ఉబ్బి కంఠం బొంగురు పోయిందన్నమాటే. అంతగా ఉత్సాహంలేని రామచంద్రం హెచ్చరిక చేసేవరకూ అన్నం తినాలనే ధ్యాసకూడా ఉండదు. లక్ష్మమ్మగారు విసుక్కుంటూండేవారు. 'మొగవాళ్ళతో సమానంగా మీరుకూడా ఏమిటర్రా ఆ వాదనలు' అని ఇద్దరు కూతుళ్ళను మందలిస్తూండేవారు. అయినా ఆమె మాటలు ఎవరూ లక్ష్యపెట్టరు. (ఇంకా వుంది)

20 వేల రూపాయిలకు భీమా చేసిన వ్యక్తి ఒకడు రైలుప్రమాదంలో మృతిచెందాడు. అతని భార్యకు ఆభీమాకంపెనీ ఏజెంటు ఇలా తెలియపరిచాడు: "అమ్మా మీ భర్తగారు రైలు ప్రమాదంలో 20 వేల రూపాయలు గడించారని తెలియజేయడానికి మేమెంతో సంతోషిస్తున్నాము.

—కె. సుబ్బారావు, (కాకినాడ)

# భవదీయుడు - బంతిపూలు

నవ్వుతున్నదల్లా ఠక్కున ఆగిపోయింది.

కొంపదీసి ఈ ఊరివాళ్లకు బంతిపూలకు జన్మవైరం లేదుకదా!

"వాడికే అడక్కపోయారా?"

"అడిగా, కాని చెప్పలేదు" అన్నాను.

వసంత ఒకసారి నిట్టూర్చి "పాపం వాడి జీవితమే మార్చేసింది" అంది.

ఆశ్చర్యపోయాను—"ఏమిటి! బంతిపువ్వా?"

"కాదు సావిత్రి" అంది వసంత.

కథ మంచి పాకాన పడుతోంది అనిపించింది!

"పిన్నీ, పిన్నీ-శాంతినివాసం మావయ్య వచ్చాడు" అంటూ వార్త మోసుకొచ్చింది మా వదినగారి కూతురు.

"శాంతినివాసం మావయ్య ఎవరూ?"

"వాడే, చలపతి. మిలిటరీలోకి వెళ్ళాడుగా" అని చటుక్కున మంచంమీంచి దిగి కుర్చీలో కూర్చుంది వసంత.

నేకూడా సర్దుకుని "రండి బావగారూ—మీ విషయమే చెబుతున్నాను, కూర్చోండి" అంటూ ఆహ్వానించాను.

మనిషిలో పొద్దుటి మేఘాలు చెదిరిపోయి తేటగా ఉన్నాడు.

"పొద్దున్నటి విషయమా?" అన్నాడు తేలిగ్గా.

"మరే!" అని వసంత వంక చూశాను.

తల వంచుకుంది!

కాసేపు నిశ్శబ్దత ఆవరించుకుంది. ఆమాట ఎందుకెత్తానా అనిపించింది నాకు.

"అలా మావిడితోటలోకి వెడదాం రండి" అన్నాడు.

ఆర్నెల్ల తరువాత అత్తారింటికి వచ్చిన మానవుణ్ని. కాని బంతిపూల మిస్టరీ విడిపోతుందన్న ఆశతో వసంత వైపు చూడకుండా బయలుదేరాను.

మామిడిచెట్టు నీడలో కూర్చున్నాం.

కాసేపాగి అతనే మొదలు పెట్టాడు.

"అసలు సంతానం లేనివాళ్ళకు పిల్లలు లేరే అన్న దిగులు. ఆడపిల్లలున్న వారికి వంశోద్ధారకుడు కావాలి. పుట్టరాని మగపిల్లాడు ఉన్నవారికి ఆడపిల్లలు కావాలి. మానవుల దంతా విచిత్రం.

మా అమ్మకు నేను ఒక్కడినే సంతానం - బతికి ఉన్నది. అసలు ఆడపిల్లలు పుట్టకపోతే బాధపడేది కాదేమో కాని- పుట్టి చనిపోవటంతో మా అమ్మకు ఈలోకంనిండా మగాళ్లే అన్న భావం కలిగింది.

మా ఇంటినిండా రకరకాల పూల మొక్కలు చుట్టుపక్కల ఆడపిల్లలను ఆకర్షించేందుకు—వేసి పెంచింది మా అమ్మ. వాటి కోసం నిత్యం మా అమ్మచుట్టూ తిరిగేవారు ఆడపిల్లలు-అందులో ముఖ్యురాలు సావిత్రి.

సావిత్రి నాన్న నాకు వరసకు మావయ్య అవుతాడు. "వరసకు" అన్నమాటేగాని వారికీ మాకు చాలా సాన్నిహిత్యం ఉంది.

సావిత్రి పుట్టినప్పటినుంచీ నా భార్యగానే చలామణి అయింది మాఊళ్లో.

సెలవులకు ఇంటి కొచ్చాను. వరండాలో కూర్చుని 'మామ్' నవల చదువుతుంటే మా గేటు విసురుగా తీసి అలవాటు ప్రకారం సావిత్రి వచ్చింది. రాగానే నన్ను వరండాలో చూసి అంతలో సిగ్గుపడి వెనక్కు తిరగబోయి నాదృష్టి పుస్తకం వైపు ఉండటం చూసి సర్దుకుని బంతిపూలు కోసి పమిట చెంగులో పోసుకుంటోంది.

ఆ రంగుల ముద్దబంతిపూవుల మధ్య వనలక్ష్మిలా, తనే ఒక ముద్ద బంతిపూవులా ఉన్న సావిత్రిని చూసి ముగ్ధుడి నయిపోతున్నాను.

ఇంతలో "ఓరేయ్ చలపతీ, పట్టుకోరా దాన్ని రోజూ బంతిపూలన్నీ తనే కోసుకుపోతోంది" అంది మా అమ్మ లోపలనుంచి.

అంతకన్నా నాకేం కావాలి?

మాట వినడమే తడవుగా, అరుగుమీంచి ఒక్కదూకు దూకాను.

ఆమాట, నేను దూకటం-అన్నీ గమనించి లేడిలా, గజ్జల గుర్రంలా ఛంగున పరుగెత్తిపోబోయింది సావిత్రి. కాని గేటులో ఓణీ కొస ఇరుక్కుపోవటంతో ఒక్కక్షణం ఆలస్యమయింది.

ఇంతలో నేను గాలిలో అందుబాటుగా ఉన్న జడపుచ్చుకుని ఒక్కసారి వెనక్కు లాగటంతో గిరుక్కున తిరిగి, నిలదొక్కుకోలేక-నామీద వాలిపోయింది. పమిట చెరుగులోని బంతిపూలు నా కాళ్ళచుట్టూ కుప్పలా పడ్డాయి!

సావిత్రి కళ్ళల్లో సిగ్గు, బాధ, ఆనందం చదువుకున్న నేను చటుక్కున ఆమె జడ వదిలి పూలు ఏరదామని వంగబోయాను.

కాని అదే సమయాన సావిత్రి కూడా వంగటంతో ఇద్దరి తలలు డీడిక్కి కొట్టుకున్నాయి.

"ఇద్దరూ అలా గేటుకు దణ్ణాలు పెడతారెందుకురా- ఇటొచ్చి నా కాళ్ళకు పెట్టండి" అంది వరండాలో నిలబడి ఈ తంతు చూస్తున్న అమ్మ నవ్వుతూ.

అంతలో ఒళ్ళంతా సిగ్గుపడి పోయింది సావిత్రికి. "పో అత్తయ్యా" అని నా కాళ్ళ ముందు వంగి పూలు ఏరుకుంది.

అంత మధురమయిన జీవిత మది!

బస్తీల్లో ఎవరయినా ఎదురయితే— "ఎప్పుడొచ్చావు, కులాసా, మళ్లీ కనబడతావు కదూ!"లతో సమావేశం ముగుస్తుంది.

తరువాత వీరు వారింటికి పోకపోయినా మునుకు పోయిందేమీ ఉండదు.

కాని పల్లెటూళ్ల విషయం వేరు. పొద్దున్న ఊళ్ళోకివచ్చిన మనిషి సాయంత్రందాకా కనబడలేదంటే వాళ్లు గిలగిల్లాడిపోతారు. వారివి అటువంటి మనస్సులు. బస్తీల కృత్రిమత్వం అటువైపు ఇంకా పాకలేదు.

మావాళ్ళందరిళ్లల్లో కత్తి కొద్దీ కాఫీయో, ఫలహారమో తిని తరువాత ఒకరోజు భోజనానికి తప్పకుండా వస్తానని వాగ్దానాలు చేసుకుంటూ చివరికి మావయ్యగారింటికి వెళ్ళాను.

తాపీగాకూర్చుని సావిత్రిని ఏడిపించి ఆనందించవచ్చుని ఆఖరికి వేసుకున్నాను వాళ్ల ఇల్లు!

"అత్తయ్యా" అంటూ కేకేశాను.

అందుకు సమాధానం వంటింట్లోంచి వచ్చింది—"ఎవరూ?" అని.

"నేనేనత్తయ్యా, చలపతిని."

"కూర్చో బాబూ, లోపలికి రాకు—మడికట్టుకున్నాను...అదిసరేగాని ఊళ్ళోకి నిన్ననగావచ్చి ఇప్పుడా మా ఇంటికి రావటం?" అంది.

"భలేదానివే, నిన్న అర్ధరాత్రికదా నేను వచ్చింది. మధ్యాహ్నందాకా నిద్రపోయాను" అంటూ ఇల్లంతా కలయచూశాను.

సావిత్రిజాడ కనబడలేదు. చాలా నిరుత్సాహం కలిగింది.

"ఇంట్లో ఎవరూ లేనట్టుందే?" అన్నాను అక్కడికీ.

అంతకన్న ఏమనను?

వెంటనే అర్థంచేసుకున్నట్టుంది. "ఆ సావిత్రిమాటేనా? దానివిషయం చెప్పబోకు. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందిట!"

"ఏం, ఏమయింది?" అన్నాను ఆదుర్దాగా.

"ఆ ఎప్పుడూ స్నేహితులూ, ఆటలు, సినిమాలు! ఇంటిపట్టున ఒక్క క్షణం ఉండదుకదా!"

"ఓస్, ఇంతేనా—ఈ వయస్సులో అలాగే ఉండాలిలెద్దూ" అన్నా తేలిగ్గా నవ్వేసి.

"నువ్వూ అమాటే అన్నావూ! అందుకే రాణీగారికి నేను మరీ అలుసయిపోయాను. వయస్సొచ్చిన ఆడపిల్లలు మారోజుల్లో ఇల్లు కదిలేవాళ్లా?" అంది.

విలేఖరి - (నటితో) మీకు ఎటువంటి పాత్రలంటే ఇష్టం?

నటి - (పరధ్యానంగా) "స్టెయిన్ లెస్ స్టీల్" పాత్రలంటే!

ఆర్. ఆనందరావు (మద్రాసు)

ఆవిడతో పేచీపెట్టుకోటానికి రాలేదు నేను. సావిత్రి దర్శనంకోసం వస్తే అదికాస్తా మృగ్యం అయింది.

"మరే, తప్పే!" అన్నాను విసుగ్గా.

"వంటా రాదుకదా! కూరతరగవే మాతల్లీ అంటే మూతిమూడుసార్లువిరిచి మరీవస్తుంది. మరుక్షణంలో కెవ్వున అరుస్తుంది. ఒకటి రెండు వేళ్లు తెగిఉంటాయి. ఇలా అయితే ఎలా?"

"మరే, ఎలా?" లేచినిలబడ్డాను ఇక వెడదామని.

"ఎప్పుడొచ్చావ్, అప్పుడే లేచి నిలబడ్డావు? కూర్చో-అమ్మాయి కాఫీఅయినా ఇచ్చిందా?" అని వెనకనుంచి వినబడ్డాయి మాటలు. ఉలిక్కిపడి వెనక్కు తిరిగాను.

అత్తయ్య అప్పుడే వీధిలోంచి ఇంట్లోకి వస్తోంది!

ఆశ్చర్యపోయాను—"అదేమిట త్తయ్యా, నువ్వు ఇందాకటనుంచీ ఇంట్లో లేవూ?" అన్నాను అయోమయంగా.

"బాగుంది వరస. నేను మీ ఇంటినుంచే వస్తున్నాను. కూర్చో, కూర్చో, అమ్మాయ్ సావిత్రీ" అంటూ లోపలికివెళ్లింది.

"ఆసినీ ఇందాకటినుంచీ వాళ్ల అమ్మలాగా నాటకమాడుతోందన్నమాట" అనుకుంటుండగానే ఓపళ్లెంలో మైసూరుపాకు, బజ్జీలు, గ్లాసుతో మంచినీళ్లు పుచ్చుకొని తల ఓరగా వంచి కిందపెదవిని మునిపంటితో అదిమిపట్టుతూవచ్చింది సావిత్రి!

నా ఒళ్లు పులకరించింది.

"ఇన్ని టిఫిన్లుచేస్తే రేపునాకు జీతం చాలకపోతే ఎలా రవ్వలరాణీ" అనడిగాను పళ్లెంలోపాటు చేయిపుచ్చుకుని.

"పో రంగూసి రౌడీ!" అని నవ్వి మెరుపులా ఇంట్లోకి మాయమయిపోయింది కాఫీకోసం.

అంత అల్లరి చేసేది సావిత్రి...రోజులు ఇలా చాలా ఆనందంగా గడిచిపోయాయి కొంతకాలంపాటు.

భగవంతుడు ఉన్నాడా, లేడా అన్న మీమాంస అనాదికాలంనుంచీ ఉంటూనే ఉంది.

మనం అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరిగినంతకాలం భగవంతుడన్నవాడి ప్రసక్తే మన మనస్సులోకిరాదు. ఈ విషయం కనిపెట్టి తన అస్తిత్వాన్ని మధ్యమధ్య పామరులకు జ్ఞప్తి చేసేందుకుగాను కొందరికి అనుకోనివి జరిగేట్టుగాను, ఇంకొందరికి అనుకున్నవి జరగకుండాను చేసి తనవీపు తనే చరుచుకుంటాడు.

మొదటి తెగవారు అదృష్టవంతులు, రెండవవారు దురదృష్టవంతులు!

మా ఊళ్ళో రాజకీయ చైతన్యం ఇంకా వెర్రి తలలు వేయలేదు. ఆ మాటకొస్తే రాజకీయలోకంలోకి మా వాళ్లు ఇప్పుడిప్పుడే

ఇంటి యజమాని - మీరు ఈ రోజు అద్దె అయినా చెల్లించాలి లేదా ఇల్లు అయినా ఖాళీ చేయాలి.

అద్దెకున్న ఆసామీ- మీరు చాలా మంచివారు! దయా స్వభావులు నేను ఇదివరకు వున్న ఇంట్లో ఆ రెండుపనులూ చేయించారు. మీరు ఏ ఒకటయినా చాలంటున్నారు.

ఎస్.సి. రామానుజాచార్య, (విజయవాడ)

బద్ధకంగా కళ్ళుతెరిచి చూస్తున్నారు.

పంచాయతిబోర్డు ఎన్నికలు వచ్చాయి మాక్కూడా. అసలు ఏ విషయమయినా మా ఇళ్ళవాళ్లు ఎలా చెబితే ఊరంతా అలా నడుచుకుంటారు. అంత గౌరవం ఉంది. అనుస్యూతంగా వస్తున్న ఆచారం అది.

మా నాన్నకు ఎలక్షను అంటే తలనొప్పి. "ఈనాడు మనం అన్నమాటను ఎవరూ కాదనటం లేదుకదా! ఇంకా మనకు ఎన్నికల్లో నిలబడటం ఎందుకు బావా?" అన్నారు మావయ్యతో—అంటే సావిత్రి నాన్నతో.

ఇవ్వాళ పలుకుబడి ఉండగానే సరికాదు—భవిష్యత్తుకు కూడా దాన్ని జాగ్రత్తపరుచుకోవాలి అన్న తత్వం మావయ్యది.

కాదు కూడదని మా నాన్నను పంచాయితీ మెంబరుగా నిలబెట్టి తనూ ఇంకో వార్డునుంచి నిలబడ్డాడు. సరే ఇద్దరూ పోటీ లేకుండా గెలిచారు. అంతవరకూ బాగానే ఉంది.

కాని ప్రెసిడెంటుగా కూడా మా నాన్ననే నిలబడమని పట్టుపట్టాడు మావయ్య. వద్దంటే వద్దన్నారు మా నాన్నగారు. కాని అందరిచేత చెప్పించాడు, బ్రతిమాలాడు—చివరికి ఎలాగయితేనేం ఆయన చేత 'సరే' ననిపించాడు.

మెంబర్లుగా నిలబడిన వారందరికీ మా నాన్న కబురు చేశాడు—"నేను ప్రెసిడెంటుగా నిలబడుతున్నాను" అని.

ఇంకెవ్వరూ నిలబడటం జరగలేదు... ఇంతలో ఏం బుద్ధి పుట్టిందో రెండు రోజులకు ఎన్నిక జరుగుతుందనగా ఒక రోజున మావయ్య కబురు చేశాడు.

"నేను ప్రెసిడెంటుగా నిలబడదామనుకుంటున్నాను. ఎలాగూ నా బలవంతంమీద ఒప్పుకున్నాడు కాబట్టి బావను మానెయ్య" మని.

మా నాన్నదంతా అదోకరకం. మంచిగా ఉన్నన్ని రోజులూ ప్రాణం కావాలన్నా ఇస్తాడు. మంచి తప్పితే ఆయన తాచుపామయిపోతాడు.

"వద్దు బాబో, అంటున్నా వినకుండా తనే నన్ను నిలబడమన్నాడు. తీరా నిలబడ్డాక ఇప్పుడు మానమంటాడా? రేపు నేను నలుగురిలో తలెత్తుకోవాలనేనా? అదీ కాకుండా తనే స్వయంగావచ్చి నాతో మాట్లాడితే నేను కాదనగలనా?—పాలేరుతో కబురంపిస్తాడూ? టట్, వీల్లేదు" అన్నాడు.

దావానలంలా వ్యాపించిపోయింది మా నాన్నకు, మావయ్యకు పోటీ అని. అవకాశం ఎదురు చూస్తున్నవారంతా చెరొక వైపు సమర్థించటం మొదలు పెట్టారు.

చివరికి మావయ్యా, నాన్నా కూడా జరుగుతున్నదేమిటో తెలుసుకునేంతలో రెండు పార్టీలవారికి రెండు మూడుసార్లు దెబ్బలాటలు కూడా జరిగిపోయాయి.

ఇద్దరూ తెల్లబోయారు!

అంత వేగంగా జరిగిపోయాయి సంఘటనలు. వీరిద్దరినీ అడ్డం పెట్టుకుని ఊళ్లోవాళ్లు తమతమ కక్షలు సాధించుకోసాగారు.

ఇద్దరికీ తెలుసు—తాము విడిపోతున్నామని. కాని వాళ్ళు చేయకలిగిందేమీ లేకపోయింది చూస్తూ కూర్చోవటం తప్ప.

రోషాలు పెరిగాయి; పట్టుదలలు హెచ్చాయి. ఆ ఇంటికాకి ఈ ఇంటిమీద వాలటం మానేసింది. ఇంట్లో ఆడవాళ్ళు గోలపెటినా అది సముద్ర ఘోష అయింది. వారికీ మాకూ ఎడముఖాలు, పెడముఖాలు అయాయి.

చివరికి ప్రెసిడెంటుగా మావయ్య గెలిచాడు. కాని అందుకు ఆ రెకరాల మాగాణి హారతి కర్పూరం అయిందని ఊళ్ళో గుప్పుమంది.

ఓడిపోవటంతో మానాన్న తాచుపాములా బుసకొట్టాడు. తల్లిదండ్రులు చేసిన మంచికిగాని, చెడుకుగాని బాధ్యులు - అనుభవించేవారు-పిల్లలు.

చిన్నతనంనుంచి అనుకుంటున్నమాట—ఊరంతా జరుగుతుందనుకున్న విషయాన్ని మావయ్య త్రోసి రాజన్నాడు.

సావిత్రికి నాకన్నా అన్ని విధాలా అధికుడ్ని తీసుకువచ్చి పెండ్లి చేయాలని పట్టుపట్టాడు. కాని ఆయన ఆవేశంలో ఒక విషయాన్ని విస్మరించాడు.

నేను ఒకపురుగు నయినప్పటికీ సావిత్రి ఆపురుగే కా[illegible]

సావిత్రి ఏడిచిం[illegible] గోలపెట్టింది, భస్తానంది—కాని ఆయన చలించలేదు. "నువ్వు చస్తే నీశవానికి పెళ్లి చేస్తాను" అన్నాడు.

నేనేం చేయగలను? అశక్తుడ్ని. అక్కడికీ అయిన వాళ్లు కల్పించుకుని నీకింత మూర్ఖత్వం తగదని చెప్పిచూశారు.

# బవదీయుడు:-బంతిపూలు

కాని "సావిత్రి నాకూతురనే ఈ నాటి వరకు అనుకుంటున్నాను" అన్నాడుట.

చివరికి ఎమ్మెస్సీ పాసయిన అబ్బాయితో సావిత్రికి పెళ్లి నిశ్చయమయింది.

పెళ్లి రెండురోజు లుందనగా మాచెల్లాయి వసంత ఇక చూస్తూ ఊరుకోలేకపోయింది. సావిత్రి నేను ఒకచోట కలుసుకునేట్టుచేసి మా ఇద్దరినీ రెండోకంటికి తెలియకుండా పారిపొమ్మని సలహాఇచ్చింది. "ఇవాళ ఆవేశంలో మిమ్మల్ని తిట్టుకున్నప్పటికీ, ఏనాటికయినా వాళ్లు పశ్చాత్తాపపడక మానరు. కన్నకడుపామరొకటా–పైగా అయినవాళ్లం!" అంది.




సరే ఆ మర్నాటిరాత్రికి మా ప్రయాణం సిద్ధంచేసింది.

సామాను సూట్ కేసులో పెట్టుకుని, చేతి కందినంత డబ్బు తీసుకుని రాత్రి పన్నెం డింటికి వీధితలుపు తీశాను.

పొన్నుకర్ర చేత పట్టుకుని నిలబడి ఉన్నారు నాన్నగారు! నీరయిపోయాను.

"నన్నిలా బతకనీయవా నాయనా? సావిత్రిని నీకిస్తానని వాడొస్తే నేను కాదనే వాడినా? వాడు కావాలని చేసేదానికి బాధ్యతనాదా? అవమాన పడవలసిన వాడిని నేనా? క్షణికమయిన నీ ఆనందంకోసం నీతండ్రిని వాడిముందు తలవంచుకునేట్టు చేయదలుచుకున్నావా?...సరే, నీసుఖానికి నేను అడ్డురాబోను. నన్ను చంపి అడుగు బయటపెట్టు" అంటూ తలవంచారు.

అంత గంభీరమయిన మనిషి నోటివెంట అటువంటిమాటలు విని రాయిలా నిలబడి పోయాను. ఆయన గొంతులోని వణుకును గమనించి చలించిపోయాను.

ఆయనకు పరువుప్రతిష్ఠలు కావాలి. నాకు సావిత్రి కావాలి.

నేను మూర్ఖంగా వెళ్లినప్పటికీ ఆయన ముక్కుమూసుకుని ప్రాణం వదలగల సమర్థుడు. ఆడదానికోసం–స్వార్థంకోసం–తండ్రిని పొట్టన పెట్టుకున్నాడన్న అపప్రధ నాకు రాకమానదు. నాజీవితం నాశనమయి పోవటమే నాకిష్టం.

గిరుక్కున వెనక్కుతిరిగి ఇంట్లోకి వెళ్లి పోయాను!

కాని ఆరాత్రే ఇంకోగంట పోయాక ఈ పాడు ప్రపంచానికి దూరంగా వెళ్లి పోయేందుకు బయల్దేరాను – ఒంటరిగా. ఆర్నెల్లపాటు ఎటు తిరిగానో, ఏంచేశానో నాకే తెలియదు.

సావిత్రి ఏమయిపోయిందో అంతకన్నా తెలియదు.

తరువాత మిలిటరీలో చేరిపోయాను. మమ్మల్ని కాశ్మీర్‌కి పంపించారు.

నా అడ్రసుమట్టుకు తెలియపర్చకుండా ఇంటికి అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాసే వాడిని.

మూడేళ్లు యాంత్రిక జీవితం గడిపిన నాకు హఠాత్తుగా ఇంటిమీద గాలితిరిగి సెలవుపెట్టి బయల్దేరాను.

మనం పెద్దవాళ్ళ మయ్యామని అనుకున్నా మన పెద్దవాళ్ళ దృష్టిలో ఇంకా 'పసివెధవ'లుగానే ఉండిపోతాం.

కోరు ఉప్పుతో స్వాగతం పలికింది అమ్మ.

'నా సర్వస్వం నీకే ధార పోశాను. ఇప్పుడేమో నన్ను వివాహం చేసుకోనంటున్నావు' అని ఫిర్యాదుగా అన్నాడు అతను.

'అవును. తెలిసి తెలిసీ ఇలాంటి దుబారామనిషిని ఎలా కట్టుకోను? అని సమాధానం ఇచ్చింది ఆ అమ్మాయి.

ఎస్. వి. రామానుజాచార్య.
(విజయవాడ)

వళ్లంతా కళ్లుచేసుకుని నాఒంటిని తడుము తుంటే కంట్లలో నీళ్లుతిరిగాయి.

భోజనం చేస్తున్నాను. వచ్చినప్పటినుంచీ ఒకవిషయం అడుగుదామనుకున్నాను గాని అది ఎలా అడగాలో తెలియక అడగటం జరగలేదు. చివరికి అమ్మే అంది.—

"సావిత్రి ఇప్పుడు ఇక్కడే ఉంది తెలుసా" అని. నాలో నాకు తెలియకుండనే ఉక్రోషం కలిగి "మూడవ పురుడా!" అనడి గాను హేళనగా.

సావిత్రి పెళ్ళయి మూడేళ్ళు దాటలా మరి!

"అతనుపోయాడుగా" అందిఅమ్మ. చేతిలో ముద జారి విస్తట్లో పడిపోయింది.

"ఇప్పుడేం? పెళ్ళయిన తరువాత మూడు నెలలు కాపరం చేసింది. అంతలోనే కారు కింద పడి చచ్చిపోయాడాఅబ్బాయి. మూడే ళ్ళ మట్టీఇక్కడే ఉంది... అయినా ఇప్పుడు మునుపటి సావిత్రి కాదులే!"

కంచంలో చేయి కడిగి లేచి పోయిన నన్ను చూసి తెల్లబోయి ఉంటుందిఅమ్మ.

మనస్సు బావుండక బజారు వెంట బయలు దేరాను. పరిచయస్తుల చిరునవ్వులతో, సన్నిహితుల పలకరింపులతో సాగిపోతున్న నేను అప్రయత్నంగా ఆగిపోయాను.

శిథిల గృహాన్ని–దాని గత వైభవం చూసి ఉన్నవారు–గుర్తుపట్టడం కష్టమేకాని అసంభవం మట్టుకు కాదు. చెట్టుమోడు వారినా దాని వసంతం జ్ఞప్తికి రాకపోదు.

నుంచున్నది సావిత్రి!

పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ సావిత్రి దగ్గరకు వెళ్ళాను. నన్ను చూసి తెల్లగా పాలి పోయింది సావిత్రి.

"సావిత్రీ" అన్నాను ఆవేశంతో.

"ష్, ఇప్పుడు కాదు. సాయంత్రం మామిడి తోటలోకి రా" అంటు ఇంట్లోకి వెళ్లిపోయింది.

సావిత్రిని చూడగానే గతం నా కళ్ల ముందు కదిలింది. రాగంలో అపశ్రుతిలా సావిత్రి ప్రస్తుతరూపం స్ఫురణకొచ్చి నా మనస్సు కలుక్కుమంది.

ఆ చలాకీతనం, సంతోషం ఏమయిపోయాయి? సావిత్రిని ఇలా చూడలేను. ఆమె జీవితంలోకి వసంతం తేవాలి. ఆమెను మళ్ళీ మామూలు మనిషిని చేయటం నా కర్తవ్యం. దానికి ఒకే ఒక మార్గం!

"నేనేదో క్షణికోద్రేకానికి లోనై నిన్ను అడుగుతున్నాననుకోకు సావిత్రీ—బాగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. ఆనాడు నిన్నూ, నన్నూ విడదీశారు. ఈనాడు ఏశక్తీ మనల్ని వేరు చేయలేరు" అన్నాను సావిత్రితో ఆమర్నాడు. ముఖాన్ని చేతులతో కప్పుకుని నిశ్శబ్దంగా ఏడ్చింది! ఆశ్చర్యపోయాను.

"ఏమిటి సావిత్రీ—తప్పుందా నేనన్న మాటల్లో?"

"నేను నీకు తగను బావా! నన్ను మర్చిపో—నీ నిష్కల్మష హృదయాన్ని నన్ను గురించి కలుషితం చేసుకోకు" అంది ఏడుస్తూ.

"అదేం మాటలు సావిత్రీ, నేను నీకోసం త్యాగం చేస్తున్నానని—దానికి నువ్వు తగవనేటువంటి పిచ్చిఊహలు మనస్సులోకి రానీయకు. సూటిగా చెప్పాలంటే—నువ్వింకోలా అనుకోకపోతే—దేవుడు ఈరకంగానైనా నిన్ను నాదాన్ని చేసుకొనే అవకాశం నా కిచ్చినందుకు పొంగిపోతున్నాను.

"ఈ సంఘంతో నాకు నిమిత్తంలేదు. నాక్కావలసింది సావిత్రి—ఆ అమ్మాయికి ఇష్టం లేకపోయినా బలవంతానయినా రాక్షస వివాహం చేసుకుంటాను. అసలే మిలిటరీ వాడిని తెలుసా!" అన్నాను.

ఏడుపులోకూడా నవ్వేసింది. నీళ్ళ వెనక కళ్లు తళుక్కుమన్నాయి.

"నన్ను మర్చిపోలేవా?" అంది.

"ఊహు! రేపు రాత్రి తొమ్మిదికి మన ప్రయాణం. నేరుగా కాశ్మీర్ తీసుకుపోతాను, కాశ్మీర్ సుందరి నవుదువుగాని."

ఏదో నిర్ణయానికి వచ్చినదానిలా నవ్వేసి "రేపే నా ప్రయాణం" అని వెళ్లిపోయింది.

తేలిక పడ్డ హృదయంతో ఇంటికి వచ్చేశాను. మనస్సులో అంతులేని ఆనందం—ప్రపంచం అంతా నవ్వుల వెన్నెల్లో మునిగినట్టుంది నా కంటికి.

నిశ్చింతగా పడుకున్నాను. గడపబోయే జీవితం, మారిపోయిన చిన్ననాటి సావిత్రిని మత్తుగా ఆలోచించుకుంటూ కన్ను మూశాను. లేచేసరికి మా అమ్మ కళ్లు ఒత్తుకుంటూంది.

"ఎందుకు?" అన్నాను.

"చూశావురా. సావిత్రి ఎంతపని చేసిందో" అంది. నాకు నవ్వొచ్చింది. 'చేయబోతోంది' అనాలి అనుకుని "ఏంచేసింది?" అన్నాను.

"నూతిలోపడి బలవంతంగా ప్రాణం తీసుకుంది!"

నిలువునా నా మీద పిడుగుపడి నన్ను చీల్చుకుంటూ పోయింది. చెవుల్లో సముద్ర ఘోష. భూమి కదిలిపోయింది

"అసలు తెల్లవారుఝామున చూసుకుంటే కనబడలేదుట. వారా వీరా అని వెతుకుతే నూతిలో తేలుతోంది. పైగా పట్టుచీర, కణుంరవిక కట్టుకుని ముఖంనిండా పసుపురాసుకుని, పెద్ద బొట్టుతో—పెద్ద ముత్తయిదులా ఉంది.... సన్యాసికి నిండా ఇరవయ్యేళ్ళు లేవు దాని బతుకిలా తెల్లవారిపోయింది." ఏడుపు మొదలెట్టింది.

నేనేం చేశాను? సావిత్రిని ఉద్ధరిద్దామనుకుని ఆమె మరణానికి కారకుడనయాను.

అసలు సావిత్రి అంత అఘాయిత్యం ఎందుకు చేసింది? పెళ్ళంటే ఇష్టంలేకనా! ఆలోచించుకుంటూ వీధినపడ్డాను—ఆఖరి దర్శనం చేసుకుందామని.

కాని అది దక్కలేదు.

ఎలా తెలిసిందో పోలీసులకు ఈ విషయం తెలిసి 'హత్యా, ఆత్మహత్యా' తేల్చేందుకని శవపరీక్షకు పంపారుట.

నా సావిత్రిని కత్తితో కోసేందుకు వీళ్ళకు అధికారం ఎవరిచ్చారు? అని బాధపడ్డాను.

సాయంత్రానికి ఊరంతా ఒకటేమాట—సావిత్రి ఒట్టిమనిషికాదు కడుపుతో ఉందని. మూడవ నెలట!

"నేను నీకు తగను బావా! నన్ను మర్చిపో" అన్నమాటల అర్థం ఇప్పుడు తెలిసింది. ఏడుపుకు కారణం బోధపడింది. "రేపే నా ప్రయాణం" అన్నమాట వెనక ఎటువంటి నిర్ణయం ఉందో అప్పట్లో తెలుసుకోలేకపోయాను.

అసలు సావిత్రి ఎందుకింత దిగజారిపోయింది? దానికి కారకులెవరు? అన్న ప్రశ్నలే నాలో కలుగలేదు.

కాని "సావిత్రి నన్నెందుకింత అపార్థం చేసుకుంది? నాకీమాత్రం విశాలహృదయం లేదనుకుంది ఎందువలన? విధవగా స్వీకరించటానికి సిద్ధపడిన నేను ఈ స్థితిలో మట్టుకు నిరాకరిస్తానని ఎందుకు అపోహపడింది?" అని బాధపడ్డాను.

ఆ నాటినుంచీ బంతిపూలమాట ఎత్తితే బావగారూ—ఆ నాటి సావిత్రి జ్ఞప్తికి వస్తుంది."

శూన్యంలోకి చూస్తూ ముగించాడు చలపతి.

ఇద్దరం మౌనంగా ఇంటికి నడక సాగించాం.

సావిత్రి చేసినపని మంచిదా కాదా అన్న ధర్మసందేహం కలిగింది నాకు.

చనిపోయిన గేదెకు పాడి బోలెడుట!

చనిపోయింది కాబట్టి చలపతి ఇలా అంటున్నాడుకాని నిజంగా చెప్పిఉంటే ఆమెను స్వీకరించేవాడా అంటే—ఏమో, ఏమీ చెప్పలేం—అతను మిలిటరీవాడు! ★

### పరుగెత్తని గుర్రం

ఇది నలభైఏళ్ళ క్రిందటి మాట. పాఠశాలలో చదువుకొంటున్నాను. మా ఉపాధ్యాయులు సుమతీశతకంలో పద్యాలు చెబుతున్నారు. "అక్కరకు రాని చుట్టం ..." వచ్చింది. మరి నా సహాధ్యాయితో ఒక పేచీ వచ్చింది. పట్టిపట్టి ప్రతి పదం చెప్పేటప్పుడు పద్యం అంతా సరిగానే చెప్పేవాడు. గుక్క తిప్పుకోకుండా చెప్పేటప్పుడు మాత్రం "దానెక్కిన పరుగెత్తని గుర్రము" అనేవాడు. విద్యార్థులు అందరు గొల్లుమనేవారు. ఇలా ఎన్నిసార్లో జరిగింది. మావాడు ఎంత ప్రయత్నించినా మొదట అలవడిన ఈ పాఠాంతరంమాత్రం అలానే నిలిచిపోయింది.

ఎస్. మద్రాసు.

పూర్తిగా మర్చిపోవాలన్నారు. అవధాని మాత్రం పట్టుపట్టి ఆయన్ను ఒప్పించాడు. ఆ రోజు రాత్రి పదిగంటలకైలుకు సాహేబ్ పురానికి వెళ్లేట్టు అక్కడినుంచి రోజూ మాకు ఉత్తరం వ్రాసేట్టు చెప్పి రమణరావుగారిచేత ఎలాగయితేనేం ఒప్పించాడు. తనతోపాటు చిత్రాన్ని కూడా తీసికెళ్లాడు. మళ్ళీ మర్నాడు సాయంత్రం కలుసుకుంటానని రమణారావుగారితో చెప్పి నేను వెళ్లిపోయాను.

* * *

రెండు రోజుల తర్వాత అవధాని దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. సాహేబ్ పురంలో ఆ నవాబులకు చెందిన భవనం బాగా పాడుపడి పోయినట్లూ, తానా రాత్రి అందులో గడపటానికి ఏర్పాటు చేసికొన్నట్లూ వ్రాశాడు. అంతేకాక వారి వంశం వారికీ ఊరి ప్రక్కనేఉన్న కొంతమంది నవాబులకూ విరోధాలు ఉండేవనీ అందువల్లనే మేము చూసిన బొమ్మలోని కుర్రాడు ఏదో దుష్ప్రయోగానికి బలి అయ్యాడని అక్కడ చెప్పుకుంటున్నారని కూడా వ్రాశాడు. పాడుపడిపోయిన కట్టడాన్ని వర్ణించాడు. జలాలుద్దీన్ చనిపోయిన చోటు గురించి కొంచెం చెప్పాడు. అదొక విశాలమైన మంటపంవంటిది. దానికి ఆనుకునే ఉన్నతోటలో ఒకపెద్దపాడుపడిన నుయ్యి, దట్టంగా పెరిగిఉన్న చెట్లూ మొదలైనవి ఉన్నాయి. ఇటువంటి వర్ణనలను మేమెక్కువ పట్టించుకోలేదు. రమణారావుగారు అవధాని మొండితనానికి విసుక్కున్నారు.

* * *

ఆ మర్నాడు ఉత్తరమేదీ రాలేదు.

# చిత్రవధ

(23 వ పేజీ తరువాయి)

రమణారావుగారు కొంచెం భయపడ్డాడు. ఆ రాత్రే సాహేబ్ పురానికి బయలుదేరివెళ్లాలన్నారు. మరుసటిదినం వెళ్లినట్లయితే నేనుకూడా సెలవుపెట్టి వస్తానన్నాను.

ఆఫీస్‌కు సుమారు పదిన్నరకు రమణారావుగారు టెలిఫోన్ చేశారు. "రావ్రూ! నీకు ఘోరమైన వార్త చెప్పాల్సొస్తోంది!" ఆయన గొంతుకలో ఆందోళనా, విచారమూ స్పష్టంగా ధ్వనించాయి. "పొద్దున్నే మా ఇంటికి ఇద్దఱు పోలీసువాళ్లు వచ్చారు. మన అవధాని చనిపోయినట్లు వార్త వచ్చిందనీ నేను సాహేబ్‌పురం వెళ్ళవలసి ఉన్నదనీ చెప్పారు. ఇప్పుడేంచేద్దాం?" ఈ వార్తకు నేనొక క్షణం నిర్ఘాంతపోయాను. నేను కూడా వస్తానని అప్పుడే అనుమతి తీసుకొని రమణారావుగారివద్దకు వెళ్లాను. రైలుకోసం ఆగకుండా రమణారావుగారి కారులో బయలుదేరి వెళ్లాము. దారిలో రమణారావుగారు మరికొన్ని వివరాలు చెప్పాడు. అవధాని హత్య చేయబడినాడనే అనుమానం ఉన్నట్లు పోలీసువారు తెలియబరిచారని అన్నారు. అవధాని డైరీ మొదలైనవాటిని బట్టి తనకు కబురు చేసినట్లుకూడా చెప్పారు.

* * *

సాహేబ్‌పురం చేరుకునేటప్పటికి సాయంత్రం కావచ్చింది. అదొక చిన్న ఊరు. మనుష్యుల దుస్తులలో, మసీదులలో నవాబుల ప్రభావం తెలుస్తూ ఉంది. నేరుగా పోలీస్ స్టేషన్‌కు వెళ్లాము. అక్కడ సబ్ ఇన్స్‌పెక్టర్ రమణారావుగారి స్థితి చూచికి చాలా సానుభూతి చూపాడు. అవధాని శవాన్ని చూడగానే నాకూకూడా కొంచెం భయంవేసింది. గొంతు పిసికి చంపేసిన గుర్తులు స్పష్టంగా కనుపిస్తున్నాయి. పొట్ట మీదకూడా ఘోరమైన గుర్తులున్నాయి!

"ఇదొక హత్యా కేసేమోనని అనుమానంగా ఉంది" అన్నాడు సబ్ ఇన్స్‌పెక్టరు. ఆ తర్వాత స్టేషన్‌కు వెళ్ళి ఆయన అడిగిన ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చాము. అవధాని కేవలం చరిత్రపరిశోధనకు వచ్చినట్లు చెప్పాము. అవధాని అనుమానాలను గురించి ఏమీ చెప్పలేదు. విచారణ ముగిసేదాకా వెళ్ళవద్దని ఇన్స్‌పెక్టర్ చెప్పగా, ఆ ఊళ్లో ట్రావలర్స్ బంగళాలో మకాము చేశాము. రమణారావుగారిని ఈ సంఘటన బాగా కదిల్చివేసింది. మాట్లాడకుండా కుర్చీలో కూలబడిపోయారు. ఆయనతో సంభాషణకు నేను కూడా ప్రయత్నించలేదు.

చీకటి పడుతూ ఉందనగా సబ్ఇన్స్‌పెక్టర్ వచ్చాడు. కొంతసేపు ఇవీ అవీ మాట్లాడిన తర్వాత "నేను ముందు ఈ విషయం ప్రస్తావించలేదు. ఈ ఊళ్లో కొన్ని వింతకథలు చెప్పుకుంటూ ఉంటారు. కేవలం కథలే అనుకున్నాను. కాని మీ అవధానిగారి డైరీ చదివిన తర్వాత నాకుకూడా అనుమానం తోస్తోంది" అని తికమక పడ్డాడు. ఆ డైరీలో ఉన్నది ఇది:

"రాత్రి 11-30. బాగా వెన్నెలగా ఉంది. బా... లైటు అనవసరమని ఆర్పేశాను. నా ఊహ... త్రం అయిఉండవచ్చు. ప్రతి చెట్టూ భయంకరంగా కనిపిస్తోంది. రావు ఉండి ఉంటే నా భయాన్ని చూసి నవ్వేవాడు. ఏం తోచటం లేదు.

"రాత్రి 11-45. ఆ నూతిని చూసినప్పుడల్లా ఓవిధమైన భయం వేస్తోంది. శంకరనాయర్ ఈ నూతినిగురించే చెప్పాడు. అతన్ని తీసికొనివచ్చి ఉంటే బాగుండేదేమో.

"రాత్రి 12. దూరంగా గంట వినిపిస్తోంది. నూతిలోంచి ఏదో కదుల్తూ వస్తోంది. ఏదో దెయ్యంకాదుకదా! ఇక్కడనుంచి పారిపోదాం అన్నా కాళ్లు ఆడ్డంలేదు. లైటు వేశాను. ఎవరో బురఖా వేసికొన్నట్లుకనిపిస్తోంది. కాని నడక మామూలు మనిషి నడక మాత్రంకాదు. ఇటు నావైపే వస్తోంది. ఇప్పుడేంచెయ్యాలో తెలియటంలేదు. నా బాటరీలైటు ఆ ఆకారంలోనుంచి అవతలున్న గోడమీదపడుతోంది! నామనస్సులో ఒక చిత్రమైన ఊహ కదిలింది. ఆ పటాన్ని తీసి లైటువేసిచూశాను. ఎందుకో గాని ఆ నవాబు ముఖం కనిపించలేదు. దానిబదులు ఏదో పరిచితమైనది మరొకటి కనిపిస్తోంది. అది నా ముఖంలాగే ఉంది! ఇప్పుడు అరచినా నాకు సాయంవచ్చే వాళ్లెవరూ ఉండరు. ఇక వ్రాసి లాభంలేదు. మీదకు వస్తే ఏదోవిధంగా రక్షించుకోవటానికి ప్రయత్నించాలి..."

* * *

ఇన్స్పెక్టరుగారు "మీరు రావడానికి ముందు శంకరనాయర్ ని కలుసుకున్నాను. అతనొక రిటైరు హెడ్ కానిస్టేబులు. మీ స్నేహితుడు అక్కడ రాత్రి గడుపుతానంటే వద్దనివారించాట్ట. చివరికి తనసైనా వెంట వెళ్లనిమ్మని అడిగాడుట శంకరనాయర్. అవధానిగారు అతన్ని వదలించుకొనేందుకు గాను, సరే అని ఒప్పుకుని, తానారాత్రి వెళ్ళటంలేదని, మర్నాడు ఇద్దరు కలిసి వెళ్దాం అని పంపించేశాడుట. శంకరనాయర్ మంత్రాలు అవీ ఇవీ తెలిసినవాడు. ఇక్కడ నవాబును గురించి ఉన్న కథలు మీరు వినే ఉంటారు. మీకేం అభ్యంతరం లేకపోతే ఇవ్వాళ రాత్రి దీని అంతు కనుక్కుందాం......" అన్నాడు.

"తప్పకుండా వెడదాం" అని నేనన్నాను. రమణారావుగారుకూడా సరే నన్నారు... ఆ రాత్రి పదకొండు గంటలకు మేమంతా ఆ భవనానికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాం.

* * *

శంకరనాయర్ కి ఇంచుమించు అరవై సంవత్సరాలున్నా మంచి విగ్రహం. అంతకంటే చాలా చిన్నవాడుగా కనిపిస్తాడు. గిరజాలు, చందనంతో చిత్రంగా ఉన్నాడు. అవధానికీ తనకూమధ్య జరిగిన సంభాషణను క్లుప్తంగా చెప్పాడు. రమణారావుగారి కారులో ఆ భవనాన్ని చేరుకొనే టప్పటికి పదకొండు దాటింది. అవధాని చెప్పినట్లే ఎక్కడ చూసినా పొదలు, చెట్లు దట్టంగా పెరిగిపోయి ఉన్నాయి. మంటపం, దాని ప్రక్కన తోట, నుయ్యి, అన్నీ అవధాని వర్ణించినట్లే ఉన్నాయి. "అవధాని శవం దొరికినచోటు ఇదే. జలాలుద్దీన్ శవంకూడా ఇక్కడే దొరికిందని అంటారు" అన్నాడు సబ్ఇన్స్పెక్టరు. అక్కడే ఆ రాత్రి గడపాలని నిశ్చయించాం. రమణారావుగారు తెచ్చిన జంబుఖానా ఒకటి పరచి కూర్చున్నాం.

శంకరనాయర్ సుద్దముక్కతో జంబుఖానా చుట్టూ కొన్ని గీతలు గీశాడు. కొంచెం విభూతికూడా అక్కడక్కడ చల్లాడు. కొన్ని నిమ్మకాయల్ను అమర్చాడు.

ఏ పరిస్థితులలోనైనా ఆ గీత దాటివెళ్లవద్దని చెప్పాడు. "అప్పుడే పదకొండున్నర అయింది" అన్నాడు సబ్ఇన్స్పెక్టర్. ఎందుకో అందరం స్తబ్ధుగా అయిపోయాం. నూతివైపుచూస్తూ కూర్చున్నాం. కొన్ని నిమిషాలు గడిచాయి. "అదిగో చూడండి!" సబ్ఇన్స్పెక్టరు మెల్లిగా అన్నాడు.

"ఎవరూ కదలొద్దు" అన్నాడు శంకరనాయర్. వెన్నెలలో నూతిగోడ స్పష్టంగా కనిపిస్తోంది. లోపలనుంచి మెల్లిగా ఏదో పైకి లేస్తోంది. ముందు గుండ్రంగా, నల్లగా కనిపించింది. తర్వాత ఒక ఆకారం పైకి వచ్చి మా ప్రక్కకు రావటం మొదలుపెట్టింది. సబ్ఇన్స్పెక్టరు తొందరగా టార్చిలైటు వెయ్యబోగా అది అతని చేతిలోంచి జారి, శంకరనాయర్ గీసిన గీతల అవతలికి దొర్లిపోయింది. దాన్ని తీసుకుందామని సబ్ఇన్స్పెక్టరు ముందుకు జరుగబోగా శంకరనాయర్ అతన్ని చెయ్యిపట్టుకుని ఆపాడు.

బురఖాలో ప్రత్యేకంగా భయం కలిగించేదేమీ లేకపోయినా, ఆ ఆకారాన్ని చూస్తూంటే నాకెందుకో భయంవేసింది. అది మామూలుమనిషి నడిచినట్లు లేదు. ఒక్కొక్క అడుగు మెల్లిగా ఒక కొయ్యబొమ్మ వేసినట్లు వేస్తోంది. మేము ఎవ్వరూ మాట్లాడకుండా చూస్తూఉండగా శంకరనాయర్ తనలోతాను ఏదో చదువుకోవడం మొదలుపెట్టాడు. ఇంతలో ఒక చిన్నమబ్బు కప్పేసి అంతా చీకటైపోయింది. రమణారావుగారు నా చెయ్యి గట్టిగా పట్టుకున్నారు. మబ్బు తొలిగేటప్పటికి వెన్నెలలో ఆ ఆకారాన్ని బాగా దగ్గరగా చూశాం. తలపైని నల్లగుడ్డ ఉన్న సందులోంచి ముఖం...ముఖం ఉండవలసిన చోట్లో ఉన్న ఒక పుర్రె కనిపించింది. ఆ పుర్రె ముక్కు, కళ్ళు నల్లని రంధ్రాల్లాగ ఉన్నాయి. రమణరావుగారు మూర్ఛపోయినట్లు నా చేతి పట్టువదలటంవల్ల తెలుసుకున్నాను. ఆ ఆకారం సరిగ్గా గీతదగ్గరకు వచ్చి ఆగిపోయింది. రెండు మూడుసార్లు మెల్లిగా గీతచుట్టూ తిరిగి నూతివైపు నడిచి వెళ్ళిపోయింది: అందులోకివెళ్లి మాయమైపోతుందని అనుకుంటుండగా గోడమీద కూర్చుంది.

"మనకోసం కాచుకునిఉంది చూశారా!" అన్నాడు శంకరనాయర్. అతని కంఠంవిని అదొకసారి తల[illegible] మళ్ళీ దాచేసింది. ఆ రాత్రి ఎలా[illegible]మో మాకే తెలియదు. ఎక్కడో [illegible]కోడి కూతవినిపించింది. చీకటి ఇంకా ఉండగానే ఆ ఆకారం మెల్లిగా నూతిలోకి దిగి మాయమైంది. కొంత సేపైన తరువాత శంకర్ నాయర్ అనుమతితో అందరం బయటికి వచ్చాం. అప్పటికి రమణరావుగారుకూడా బాగా కూచొన్నారు. నూతిలో ఏముందో చూద్దామని శంకరనాయర్ అనగా వెళ్లి చూశాం. లోపల అంతా చెత్తచేరిఉంది. సాలెగూళ్లు బాగా అలుముకున్నాయి.

* * *

కొన్ని రోజుల తర్వాత ఆ నూతిలో వెతగ్గా పొడుగైన నల్లటిపెట్టె దొరికిందని, అందులో నల్లనిగుడ్డ కప్పబడిఉన్న ఒక ఆస్థిపంజరం దొరికిందని విన్నాం. ఆ పెట్టె బయటపడిన తర్వాత మళ్ళీ ఆ ఆకారం కనిపించలేదని సబ్ఇన్స్పెక్టరు మాకు రిపోర్టు చేశాడు. ఆ చిత్రపటం ఈరోజుకూ రమణరావుగారి దగ్గర ఉంది. దానిలో బొమ్మలు కూడా కదలడం మానేశాయి. ★

తండ్రి-టైమెంత అయిందో చూడిరారా.

కొడుకు - నాకు తెలియదు నాన్నా.

తండ్రి - మళ్లీ పదేళ్ళు వచ్చాయి వెధవకి. పోనీ పెద్ద ముల్లు ఎక్కడో చిన్న ముల్లు ఎక్కడో చూడిరా.

కొడుకు - రెండు ముల్లు గడియారంలోనే వున్నాయినాన్నా!

కె. వి. సుబ్బారావు (హైదరాబాదు)



# వనితాలోకం

## పనిపాట్ల నుంచి 'పంచశీల' దాకా సర్దుకు పోవడమే శరణ్యాం!

సలక్షణంగా కాపురాలు సాగాలంటే...ఒక చక్కని జీవనవిధానం అలవరచుకోవాలి. ముఖ్యంగా ప్రతివారు కుటుంబంలోని ఇతరులతో సర్దుకుపోవడం నేర్చుకోవాలి. దీనికి ఇసుమంత సహనం, సంయమం అవసరం సర్దుకుపోవడం ఒక కళ. దానివల్ల సంఘర్షణ సమసిపోతుంది కళ కనుక కాంతి లభిస్తుంది,

### ఇంటావిడతో....

మా ఇంటావిడ కొంచెం కోటీదు రుసు మనిషి అని ఆ వీథిలో నేగాక, అచుట్టు ప్రక్కల మరో నాలుగు వీధుల్లో కూడ పేరు ప్రతిష్ఠలు సంపాదించుకుంది.

ఈ సంగతి నాదాకా వచ్చేసరికి, నాకు ఆ వీథిలో నలుగురితోను పరిచయమయింది.

ఉండబట్టలేకనో, లేక ఉపకార బుద్ధితోనో గాని అవధాని గారి పెద్దకోడలు శారద అప్పుడే నన్నడిగేసింది. "అదేమిటండీ! మూడు నెలలుదాటినా మీరు ఇల్లు మారలేదేం" అని.

నాకాశ్చర్యమేసింది. ఆవిడ ఎందుకావిధంగా అడిగిందో కూడ నాకర్థం కాలేదు.

"ఏం నాకానికో ఇల్లు మారాలా?" అన్నాను.

అందుకావిడ చిన్న బుచ్చుకుని—

"అదికాదండీ! ఎంతోమంది ఆ ఇంట్లో అద్దెకుదిగి నెలకాగానే వెళ్ళిపోయే అనవాయితీ వుందిలెండి! మరి మీరు మూడు నెలలు ఉన్నారంటే మెచ్చుకోదగ్గ విషయమే."

ఆవిడ అప్రసంగం ఎందుకు చేస్తోందో నాకర్థం కాలేదు. మేము వుంటున్న ఇల్లు చిన్న చిన్న లోపాలువున్నా మేము సరిపుచ్చుకుంటూ నేవున్నాం. అదీగాక, ఆ మాత్రం గాలీ-వెలుతురూ హాయిగా లభిస్తూ, ఇంటి చుట్టూ ఖాళీస్థలంతో (తోట లేకపోయినా ఫరవాలేదు) బస్తీలో దొరకటం కష్టమే. అందుచేత మేము వుంటున్న ఇల్లు మాకు బాగానే నచ్చింది.

"మీరు చెప్పేదేదో కొద్దిగా స్పష్టంగా చెబితే బాగుంటుంది" అన్నాను.

"ఆ...ఏంలేదు. నేను చెప్పినట్లు మీ ఇంటావిడతో చెప్పకండేం! అయినా, ఇంత మటుకు మీకు తెలియకపోవటం వింతగానే వుంది. ఇంట్లో అద్దెకుండేవాళ్ళతో వంకతో రోజుకో యుద్ధం చెయ్యటం ఇంటావిడకలవాటు. అసలు ఆవిడతో మాట్లాడకపోతేకూడ పోట్లాట వేసుకుంటుంది. ఆ భయంతోనే ఈవీధిలోవాళ్ళంతా ఇష్టంలేకపోయినా, ఆవిడతో స్నేహం చేస్తారు. మీ దగ్గర యేదో మంత్రం వుండివుంటుంది. లేకపోతే ఆవిడతో మీరు ఎట్లా నెగ్గుకొస్తున్నారు! ఆవిడ నోటికి పడలేకనే ఆయన ఈమధ్య ఆఫీసుకు శలవు పెట్టి తీర్థయాత్రలు చేస్తున్నారు" అంది నవ్వుతూ, హాస్యధోరణిలో.

ఆవిడ మొగుడు నిజంగా సన్యాసం పుచ్చుకున్నాడో లేదో గాని, ఆవిడ మాత్రం నాతో కబుర్లలోకి దిగినప్పుడల్లా, 'మావారు మావారు' అంటూ ప్రతి చిన్న విషయానికి ఆయన్నే ఆదర్శంగా తీసుకొస్తుంది. పైగా, ఆయనగారి సంగతేమిటని నేనొకసారి అడిగితే, ఆయన ఆఫీసు తరఫున వూళ్ళమీదికి పంపుతున్నారని చెప్పింది. 'కాబోలు' అనుకున్నాను.

సి. కృష్ణకుమారి

### ఆవిడ గొడవ

అసలు సంగతి ఇప్పుడు గ్రహించాను.

మా ఇంటావిడని గురించి ఎందరెన్ని చెప్పినా, నేను మాత్రం ఒక్కటి గట్టిగా చెప్పగలను. మా ఇంటావిడ చీటికి మాటికి పనిమనిషి మీద, పాలవాడితోను అరుస్తూనే వుంటుంది. అప్పుడప్పుడూ ఇరుగు పొరుగులతో కూడ వ్యవహారం ముదురుతూనే వుంటుంది. ఇతర్ల సంగతి యేమన్నా కాని వ్వండి గాని, నా జోలికిమాత్రం ఆవిడరాదు. 'అంతో ఇంతో' చదువుతున్న దాన్ననో యేమో గాని నామీద ఆమెకొక పదభి ప్రాయమే వున్నట్లుంది. పైగా ఆవిడకు నామీద ప్రేమ యెక్కువైన కొద్దీ 'కృష్ణ వేణమ్మ' అనీ, 'వేణమ్మ' అనీ, 'కృష్ణవేణీ' అనీ పిలుస్తూ వుంటుంది. నేను నవ్వుతూ నాపేరు అదికాదండీ అంటే, "ఫరవాలేదు లేవమ్మ! పెద్దదాన్ని. పూర్వకాలందాన్ని. ఎట్లాగో ఒకలాగ పిలవనిద్దూ!" అంటుంది.

మా ఇంటావిడ మనస్తత్వానికి, నా మనస్తత్వానికి యెదురే అయినా నేను సరిపుచ్చుకోవటంలో సరిపోయింది. ఆవిడే అంటుంది పైగా; 'అమ్మాయి! నువ్వు మరీ అంత నెమ్మదస్తురాలివైతే ఎట్లాగమ్మా!' అని. ఆవిడ దురుసుతనానికి నా నెమ్మదితనానికి సరిపోబట్టే మేము మూడు నెలలనుండీ ఆ ఇంట్లో వుండగలుగుతున్నాం.

మా ఇంటావిడ కాలేజీల్లో లెక్చరర్లకన్నా ఎక్కువగా లెక్చర్లు ఇస్తుంది. అవి నేను వచ్చినట్లు వింటాను. ఎందుచేతనంటే "వినలేను" అనే ధైర్యం నాకులేదు. అంతా చెప్పి, 'నేను అన్నమాటే రయిటు కదమ్మా! ఆ కమలమ్మ ప్రతి మాటకు నాకు ఇరుపోటీగా వస్తుంది.' అంటుంది ఆవిడ. 'అవ్వే! ఆ కమలమ్మదంతా అన్యాయం. మీదే రైటు' అంటాను.

ఇట్లా గడుపుకొస్తున్నాను ఆవిడతో.












అన్నిటికీ ఆవిడతో ఏకీభవిస్తూ వుండటం చేతనే ఆమెతో నెగ్గుకొస్తున్నాను మరి.

ఈ రోజుల్లో, మనం ఎక్కడవున్నా, ఆ వాతావరణానికి తట్టుకుని, ఆ పరిస్థితులకు సరిపడటమనేది ఆడవాళ్ళకుండవలసిన గొప్ప కళ. ఆడవాళ్ళకు ఈ కళ లేకపోతే అన్నివైపుల నుండీ ముళ్ళపొదలుచుట్టుముట్టి బాధలు కలిగిస్తవి. ముఖ్యంగా ఆడవాళ్లు ఈ సరిపుచ్చుకోవటం అనే సుగుణాన్ని అలవరచుకోకపోతే అంతులేని బాధల గాధలకు గురికావలసివస్తుంది.

ముఖ్యంగా క్రొత్తగా కాపురం పెట్టినవారు ఇంటివాళ్ళతోను, ఇరుగుపొరుగులతోను సరిపుచ్చుకోవాలి. ఇంటివాళ్ళతో చీటికిమాటికి మనస్పర్థలు పెంచుకుని ఇలు మారుతూవుంటే 'సరిపుచ్చుకోవటం' అనే ఆదర్శమే కరవవుతుంది. ఇంటివారితో సరిపుచ్చుకోలేనివారు ఎన్ని ఇళ్లు మారినా నెగ్గుకురాలేరు. అందుచేతనే కొందరు నెలకొక ఇలు మారుతూ వుంటారు. కారణమేమిటని ప్రశ్నిస్తే, వాళ్లుచెప్పే కారణాలు చాల స్వల్పమయినవి. నిజానికి అవి చెప్పుకోదగ్గ కారణాలు కానేకావు. సరిపుచ్చుకోదల్చుకుంటే చాల తేలికగా ఎంతగయ్యాళి వారితోనైనా, వారిని పొగిడో, మరో విధంగానో మంచిచేసుకోవచ్చు.

## అతి—శ్రుతి

మరొక చిక్కుమిటంటే మనం ఇరుగుపొరుగుల్తోకూడ సరిపుచ్చుకోవాలి. ఇరుగుపొరుగు విషయాలలో మరీ లోతుగా కలిగించుకుని, చివరకు స్నేహబంధాన్ని 'శప్ప' మని త్రెంపేబదులు, పట్టీపట్టనట్లు, ఎంతవరకు వారితో స్నేహం చెయ్యాలో అంతవరకే ప్రవర్తించాలి. ఈ రోజున ఒకర్నొకరు విడలేనంత స్నేహంగావుండి, మరో నాలుగు రోజుల్లోనే బద్ధవిరోధులుగా మారటం సరిపుచ్చుకోలేకపోవటంవల్ల కలిగే ఫలితమే. ఇటువంటి సంఘటనలు మనం నిత్యజీవితంలో ఎన్నో చూస్తూనే వున్నాం.

మరికొందరు ఇల్లాళ్లు, పనిమనిషితో సరిపుచ్చుకోలేరు. పనిమనిషిచేసే పని కూడా వుడిగానే వుంటుంది. మరి నాలుగిళ్లలో పని చేసుకోవాలిగదా! అయితే, పనిమనిషి మరీ అసహ్యంగా పనిచేస్తుంటే వూరుకోమని కాదుగాని, అతిగా పోరుతూ, పోట్లాడుతుంటే పనిమనిషి మానుకుంటుంది. అందుచేతే, పనిమనిషి పనిలో కొన్నిలోపాలున్నా మనం సరిపెట్టుకోవాలి.

నిజానికి, సరిపుచ్చుకోవటం అనేది ఒక్క ఆడవాళ్ళేకాదు మగవారు పిల్లలుకూడ అలవర్చుకోవలసిన సుగుణం. కుటుంబంలో భార్య తన అలవాట్లు పిల్లలకోసం భర్తకోసం సరిపుచ్చుకోవాలి. భర్త తన ఆశయాలను కుటుంబాదాయానికి, కుటుంబ పరిస్థితులకు సరిపుచ్చుకోవాలి. మనం క్రొత్తచోటికి వెళ్లినప్పుడు అక్కడ వాతావరణానికి మనం సరిపుచ్చుకోవాలి. కోడలు అత్తగారి మనస్తత్వానికి సరిపోయేటట్లుగా ప్రవర్తించాలి. అత్తగారుకూడ కొడుకు-కోడలు దగ్గర వున్నప్పుడు వారి మనస్తత్వానికి అనుగుణంగా తన మనస్తత్వం సరిపుచ్చుకోవాలి.

పసిపాపని అర్థంచేసుకోక, యేడ్చినప్పుడు ఎత్తుకోకపోతే ఆ పాప యేడుపు, కోపం ఎక్కువవుతాయి. అందుచేత తల్లి తన మనస్తత్వాన్ని పిల్లల మనస్తత్వానికి సరిపుచ్చుకోవాలి. అదేవిధంగా ఎదుగుతున్న పిల్లలు తల్లి మనస్తత్వాన్ని గ్రహించి తమ నడవడికను సరిపుచ్చుకోకపోతే తల్లి ఆగ్రహానికి గురి అవుతారు.

ఈ సరిపుచ్చుకోవటం జాతీయ, అంతర్జాతీయ విషయాలకుకూడ వర్తిస్తుంది.

నేను పైన ఉదహరించిన విషయాలన్నీ విశదంగా చర్చించి చూస్తే ఈ 'సరిపుచ్చుకోవటం' అనే గుణం మానవుడికి యెంత అవసరమో మీకే తెలుస్తుంది.

## తప్పు ఇల్లాలిదే

భార్య తన స్వభావాన్ని, అలవాట్లను భర్త స్వభావంతో సరిపుచ్చుకోవాలి. ఆఫీసుకు టైం అయిపోతున్నా, భర్త కేకలు పెట్టి అరచినా, ఆ ఇల్లాలు పక్కింటి పార్వతితో గోడదగ్గర సోదేసుకుని కదలదు. దాంతో అసలే ఆఫీసుదగ్గరమాత్రమే కాదు, ఇంటిదగ్గరకూడ అధికారినే అనుకునే భర్తగారు, పైగా ఆఫీసుకు టైం మించిపోతుంటే పిలిచినా పలకని భార్యపైన కోపం గోదావరినదిలాగ వుప్పొంగకపోతుందా! ఆ ఇంట్లో రోజూ గ్రంథాలకు ఎక్కుయుద్ధాలు

# సర్దుకుపోవడమే శరణ్యం!

జరగకపోతయ్యా! నన్నడిగితే ఈ తప్పంతా ఆ ఇల్లాలిదే నంటాను. ఏం! ఆవిడ వేసుకునే ఆ మాస్కు ఆయనగారిని ఆఫీసుకు పంపినతర్వాత కానీయకూడదూ? ఆవిడ ఆయనమనస్తత్వానికి సరిపుచ్చుకోవాలి మరి.

అట్లాగే భర్త ఇంట్లో భార్య స్వభావాన్ని, భార్య పరిస్థితుల్నీ కూడ కొంతవరకు అర్థంచేసుకుని తన ఆశయాలని కుటుంబముతో సరిపుచ్చుకోవాలి. ఉదా:- భర్తకు అతి శుభ్రం అంటే ఇష్టం. ఇంటిని, పిల్లల్ని అతి శుభ్రంగా వుంచి భార్యకూడ యెప్పుడూ అతి శుభ్రంగా, కళకళలాడుతూ వుండాలనేది ఆ భర్తగారి ఆశయం. అతని ఆశయం అపరాధం కాదు. కాని, ఆయన తన భార్య సహజస్థితినికూడ కొంతవరకు అర్థం చేసుకోవాలి. అరడజనుమంది పిల్లల్తో సగుకొస్తూ, మళ్ళీ ఓపలేని స్థితిలో వున్న ఆ ఇల్లాలు ఒకసారి శుభ్రంగా ఇల్లంతా సర్ది, వంట చెయ్యటానికి వంటఇంట్లోకి వెళ్ళేసరికి, పెద్ద పిల్లాడు రైలాటగా కుర్చీలన్నీ వరసగా పేరుస్తాడు. రెండో పిల్లాడు అలమర్లో వున్న సామానంతా రైలెక్కిస్తాడు. (మరి అది గూడ్సుబండిగా) మరో పిల్లాడు టేబులు మీద వున్న పుస్తకాలు, పత్రికలు అన్నీ చదివినంతసేపు చదివినట్లు పేజీలు తిరగేసి, 'వాన వస్తుందేమో' అనే ఆశతో అవన్నీ చింపి కాగితం పడవలు చేస్తాడు. చివరకు విసిగెత్తి అవన్నీ ఇల్లంతా విరజిమ్మేస్తాడు. ఈలోపల తల్లి చూసి నాలు గంటిస్తుంది పిల్లల వీపులమీద. ఇంతలో ఆఫీసునుండి విసిగి వేసారి ఇంటికొచ్చి, పిల్లల యేడుపుతోను, ఇంటినిండా సామానులతోను నిండిన ఇల్లుచూసి తనఅతిశుభ్రం ఆదర్శం పాడైపోయిందనే మిషతో భార్యతో పోట్లాట వేసుకుంటాడు. ఇంకేముంది! 'ఫినిష్.' ఆ ఇంటి వాతావరణమే మారిపోతుంది ఆ నిమిషంలో.

ఎంత ఆఫీసులో అలసిపోయివస్తే మాత్రం ఆ భర్త భార్య బాధని అర్థం చేసుకోనక్కర లేదా? తనతో సమానంగా భార్యమాత్రం ఇంట్లో పనిచెయ్యటం లేదా? అంత అతి శుభ్రం వున్నమనిషి నెమ్మదిమీద తనే యెందుకు సర్దుకోకూడదు? ఎంత భార్య అయితేమాత్రం ఆమెను నానా మాటలు అనటం దేనికి?

మరొక మాట, భార్య కొత్త పొదుపరి అయి భర్తతో సిగరెట్లు మానెయ్యమనీ, లేక హోటలు పద్దులు కొద్దిగా తగ్గించమని గాని అంటుందనుకోండి ఆయన వినడు. అంతటితో ఆ సమస్య తెగిపోవాలే గాని ఆమె పోరకూడదు. లేకపోతే భర్తగారి ఆగ్రహావేశం ముందు ఆడవాళ్లు నిలవ గలరా!

## మనం మనం

మనం క్రొత్తచోటుకు వెళ్తాం! అక్కడా మనం సరిపుచ్చుకోవాలి. వాళ్ళు చేసిన వంటకాలు మీకు రుచించనివి. అప్పుడు మీరేం చేస్తారు? అవి మీకు 'సహించవు' అనకండి! వంటకాలు మహాదివ్యంగా వున్నయ్యనీ, అయితే మీ వంట్లో యేమంత కులాసాగా లేదనో లేక అవి మీ వంటికి పడవనో చెప్పి, మీకు సహించని పదార్థాలను వదిలెయ్యండి. వెళ్ళినచోట ముడుచుకు కూర్చోక, పిల్లల్ని మంచి చేసుకుని, పెద్దల్తోకలసి తిరగండి. అప్పుడే క్రొత్తచోటు అనేబాధ పోతుంది.

ఎరే! కోడలు అత్తగారి మనస్తత్వానికి సరిపుచ్చుకోకపోతే 'అత్తా-కోడళ్ళ మధ్య బయల్దేరే మనస్పర్థలు వేరే విన్నవించ నక్కర లేదుకదా!

ముఖ్యంగా అత్తగారు కాని కోడలుగాని గ్రహించాలిసిందేమిటంటే, అత్తగార్లు కోడళ్ళు తమ దగ్గరవుంటే అదుపులోవుంచుకోవాలని చూస్తారు. అందుచేత అత్తగారింట్లో వున్న కోడళ్ళు ఆ వాతావరణానికి సరిపుచ్చుకోవాలి.

అదేవిధంగా, కొడుకు - కోడలు దగ్గర వుంటున్న అత్తగారు కోడలు అదుపులో వుండాలిసివస్తుంది. అప్పుడు కోడలు అత్తగారి ఆరళ్ళను పడదు. అందుచేత అత్తగారు కోడలితో సద్భావంతో ప్రవర్తించాలి. (తన అవసరం అని అత్తగారు గ్రహించి మెసలాలి.)

పిల్లల మనస్తత్వానికి తల్లులు, తల్లుల మనస్తత్వానికి పిల్లలుకూడ సరిపుచ్చుకుంటేనే కుటుంబాలు సరిగ్గా సాగేది.

కొందరు ఎక్కడికి వెళ్ళినా ఆ వాతావరణానికి సరిపుచ్చుకుంటారు. ఈ విషయంలో 'చదువు' అనేది ముఖ్యంకాదు. స్వభావం ముఖ్యం. మరికొందరికి ఇంకోచోటికి వస్తే అన్నంకూడ సహించదు. ఆచార వ్యవహారాలలో మన ఆంధ్రులు ఇతర ప్రదేశాలకు ఎక్కడికి వెళ్ళినా సరిపుచ్చుకుని, ఆ వాతావరణానికి అనుగుణంగా ప్రవర్తించగలనే ప్రతిభ ఆంధ్రులకు వుండనే వుంది. ఈ విషయంలో తమిళులుగాని మరొకరు గాని లేక విదేశీయులే గానివ్వండి ఇతర ప్రదేశాలకు వెళ్ళినప్పుడు ఎన్ని కష్టనష్టాలు లభించినా తమ ఆచార వ్యవహారాలే తప్ప ఆ క్రొత్త వాతావరణానికి సరిపుచ్చుకోలేరనే విషయం అందరికీ తెలిసినదే.

జాతీయ అంతర్జాతీయ విషయాలలో కూడా ఈ సరిపుచ్చుకోవటం జరుగుతోంది. ప్రభుత్వం ప్రజలకోసం, ప్రజలు ప్రభుత్వం కోసం, ఒకదేశం మరొకదేశంకోసం, దేశాలు ప్రపంచం కోసం తమ ఆశయాలను సరిపుచ్చుకోవాలి, త్యాగం చెయ్యాలి.

కుటుంబంలో వ్యక్తులు తమ కుటుంబ శాంతికోసం, కుటుంబక్షేమంకోసం తమ తమ వుద్దేశాలను సరిపుచ్చుకోవాలి. అప్పుడే కుటుంబం దివ్యంగా శాంతియుతపథంలో సాగిపోతుంది.

దేశాలు ప్రపంచంకోసం తమ ఆశయాలను సరిపుచ్చుకోవటము వల్ల ప్రపంచ శాంతి వర్ధిల్లటమే గాక, సర్వజన సామరస్యము, సర్వజన సౌఖ్యముకూడ లభిస్తవి. ★

## సరళ సలహా!

పొదుపు వుంటే బ్రతుకుబాటలో కుదుపు ఉండదు. పొదుపు అంటే బతకటంలో ఒడుపు, పట్టు విడుపులకీ, కట్టు ఊడుపులకీ, అరవుడుపులకీ అన్నాలకీ కూడా గట్టిగా కొడుకొని 'పొదుపు' లేందుకొచ్చినవమ్మా అనే వయోవృద్ధులూ ఉన్నారు. పొదుపూ పొందికాలేని కాపురాలు చితుకుల మంటలుసుమండీ అనే జ్ఞానవృద్ధులూ వున్నారు. పొదుపుకీ పిసినిగొట్టుతనానికీ ఎక్కడా అటూ యిటూ ఏడు తరాలదాకా బాంధవ్యమే లేదని చెప్పే అనుభవ పరిశోధకులూ ఉన్నారు.

కొత్తగా కాపురాలకి పురాలకీ, పట్టణాలకి వెళ్ళే యువతీ యువకులు 'నేనే కలదనీ లేనే రాదనీ' భావగీతాలు పాడుతున్నా—'లేచే కలదనే' అనుభవగీతం విస్మరించకుండా 'పొదుపు' అనే ఒడుపు అలవరచుకోవాలి. అనుసరించాలి. పొదుపులో పొంకం ఇప్పుడు కాదు రేపు తెలుస్తుంది.

# వనితా వాణి



## మాటసొగసు

6-7-60 పత్రికలో లీలాసీతారామ్‌గారి వ్యాసం 'మాటసొ ... ాల సొగసు'గా ఉంది. ఈర్ష్య ... మాయన్ని అటుంచి, కొందరు ప్రశ ... తిత ... అబ్బినట్లుగా హాస్యధోరణి ... ట్లాడు గ. 'హాస్యం' కూడా శృతిమిం ... ం'గా పరిణమిస్తుంది.

అదేపత్రికలో ... ఆర్. లక్ష్మిగారు కుట్లు, హెయిర్ స్టయిల్స్‌ని గురించి వనితాలోకపు పేజీలలో వ్రాయవలసిందిగా చిన్న సలహాయిచ్చారు. సాహిత్యాన్ని, సంస్కృతినీ పెంపొందించుకొందుకి, నిత్యజీవితాన్ని సరిదిద్దుకొందుకి పనికివచ్చే వ్యాసాలే మనకి ఎంతో వుపకరిస్తాయ్, కాని 'హెయిర్ స్టయిల్స్' ఇత్యాది విషయాల గురించిన చర్చలు నిష్ఫలమేమో ననిపిస్తుంది.

ఒకసలహాయిస్తే కొంతమంది ఏకీభవించనూవచ్చు. మరికొందరు వ్యతిరేకించనూవచ్చు. కాబట్టి 'సలహా'లివ్వడం మాన వద్దని 'సరళ'గారికి నా విజ్ఞప్తి.

చక్రవర్తి పి. యస్. అరవింద
(అనంతపురం.)

* * *

## 'పిల్లలూ—పెంపకాలూ"

29-6-60 పత్రికలోని ఈ వ్యాసం నాకు చాలానచ్చింది. పిల్లల పెంపకాల విషయం 'సత్యవతి'గార్కి మంచి అనుభవము ఉందనుకుంటాను. కాని 'సత్యవతి'గారు ఒక్క పొరపాటుబడ్డారు. వారపత్రిక పాఠకులకు మన వనితామణులందరు ఇంగ్లీషు తెలిసినవార్కై ఉండరు. వారివిషయంలో కొంచెం శ్రద్ధ చూపాలి. 'సత్యవతి'గారు ఈ వ్యాసంలో "ఇమిటేట్, రిపీట్, నర్సరీ" మొదలైన ఇంగ్లీషుపదములు ఉపయోగించారు. ఇలాంటి పొరపాట్లు రాకుండాఉంటే సంతోషిస్తాము. ఈ 'సత్యవతి' గారు 'మనసునమల్లెలు' వ్రాసిన 'పి. సత్యవతీదేవి'గారేనా. ఎవరైనా సరే తమ ఇంగ్లీషు పాండిత్యాన్ని తగ్గించాలి. ఇలా వ్రాస్తున్నందుకు క్షమించండి. వ్యాసం చాలాబాగుంది. చివరివాక్యాలు చాలా నచ్చినవి.

...మిస్ "ఎక్స్" (కొలకలూరు.)

* * *

## ఫేనాజిలేబి

శ్రీమతి అద్దంకి శ్రీదేవిగారు వ్రాసిన పిండివంటలలో మా యింట్లో చేనాజిలేబీని తయారుచేసినాము. అవి చాలబాగుగా వచ్చినవి. రుచిగానున్నవి. లక్ష్మివారం(30-6-60) నాడు మా గేదె యీనుటచే శుక్రవారం జున్నుసువండి శ్రీదేవిగారు ఉదహరించినట్లు చేనాజిలేబి చేసితిమి. వారికి మాకృతజ్ఞతాభివందనములు. ఇట్లే మహిళలు తమకుతోచిన వంటలనుగూర్చి వ్రాస్తే బాగుంటుందని నా అభిప్రాయము.

శృంగారకవి రాజేశ్వరి & రాధిక
(తాడేపల్లి గూడెం)

## వినతి

వనితాలోకం సోదరీమణులకు ఎవరికైనా వల్లచాదు, ఎఱ్ఱతిలకం, కుంకుమచేయు విధము తెలిసియుండిన దయచేసి ఆంధ్రపత్రికలో తెలుపవలెను.

కె. సుందరీదేవి, పాదిలి.

* * *

## కలహానికి సలహా!

సంతోషించారు—సరళగారూ మీ సంస్థారోద్యమానికి ? అయినకొడికి ప్రతి పూర్వాచారాన్నీ విమర్శించడమేనా మీ పని ? వచ్చినపాముని చంపే ఉద్యమానికి మీరు నాయకత్వం వహించడంచూసి అంతాసంతోషించారు. చాలు ఊరుకోండి. ఆషాఢం, మూఢమీ అన్నీ మనమంచికేనని కాస్త లోతుగా ఆలోచిస్తే తెలుస్తుంది. మీ పేరు చూడగానే మీ సలహా చదవాలనిపిస్తుంది. సలహాచదివితే కలహానికి దారితీస్తుంది. ఖర్మ.

అయ్యదేవర పార్థసారధి, మద్రాసు.

---

పాకశాల:

## శ్రీఖండ్

చపాతీలకు, దోసెలకు, బ్రెడ్‌కు, ఇలాంటి వాటికి నంజుకు తినడానికి పనికొచ్చే క్రొత్తరకం డిష్ చెబుతాను. ఎప్పుడూ మన ఛట్నీలు, చట్నీపొడులేగాక ఇలాంటి, క్రొత్తరకం జామ్‌లాంటివికూడా చేసుకొంటే, మార్పుగా ఉంటుంది.

శ్రీఖండ్ చెయ్యడానికి ముఖ్యంగా కావలసింది తోడుపెట్టిన, కమ్మటి, గట్టి పెరుగు. కొన్న పెరుగు పనికిరాదు.

ముందురోజే ఒక అర్థశేరు పాలు (చిక్కటి గేదపాలుగా చూసి, మరీ కొనాలి) బాగా కాచి, అతి కొద్దిగా అందులో పెరుగువేసి తోడుబెట్టాలి. ఈ తోడువేసేటప్పుడు పెరుగు చాలా కొద్దిగా వెయ్యాలనే విషయం మరువకూడదు. పెరుగెక్కువైతే పులిసిపోయి బాగా ఉండదు.

ఉదయానికి పెరుగు గట్టిగా, రాయిలా తోడుకొని ఉంటుంది. ఇప్పుడు ఒక పలుచటి, తెల్లని, గట్టిబట్ట తెచ్చి ఈ పెరుగును అందులోవేసి మూటగట్టి, కొంచెం ఎత్తుగా వ్రేలాడగట్టాలి. గంటా, రెండుగంటలు పోయాక చూస్తే నీరంతా ఓడిపోయి గట్టి ముద్ద నిలిచిఉంటుంది.

ఈలోగా ఒకకప్పు చక్కెర మెత్తగా పొడుంగొట్టి ఒకప్రక్క ఉంచుకోవాలి. ఇష్టమైనవాగు 4 ఏలక్కాయలుగాని, కొద్దిగా పచ్చకర్పూరంగాని పొడిచేసి ఉంచుకోవాలి.

గట్టిపడిన పెరుగుముద్దను ఒకపళ్లెంలోతీసి ఉంచుకోవాలి. పిండిజల్లెడ శుభ్రంగా కడిగి, తుడిచి ఆరనివ్వాలి. జల్లెడ మూతలాగా సరిపడేంత గిన్నెను, తడిలేకుండా తుడిచి ఉంచుకోవాలి. అంటే ఈ గిన్నెపైన పిండి జల్లెడ ఉంచితే, జల్లెడ గిన్నెలోపలికి పోక, మూతలాగా పైనే ఉండాలన్నమాట. ఇప్పుడీ పెరుగును నిమ్మకాయంతేసి ముద్దలుగా చేసి, ఒక్కొక్కముద్దను జల్లెడపైనుంచి, మెల్లగా రాయాలి. ఇలా అంతా రాసేసరికి పెరుగంతా నున్నగా, వెన్నలాగా గిన్నెలోకి దిగుతుంది. ఇలా అంతా పూర్తయ్యాక అందులో తయారుగా ఉంచుకున్న చక్కెరా, ఏలకులపొడీ వేసి చెంచాతో బాగా కలపాలి.

ఇది తియ్యగా, కొద్ది పులుపుతోనూ, చాలా మధురంగానూ ఉంటుంది. ఎండాకాలం గనుక వంటికి చలువచేస్తుంది. ముఖ్యంగా బ్రెడ్‌కీ, చపాతీలకూ చాలా బావుంటుంది. దోసెలకు, ఇడ్లీకికూడా వాడవచ్చు.

—కె. రాజ్యలక్ష్మి జనార్ధనం

# మీ అందమునకు రక్షణ నిచ్చుటకు

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మరియు ఫేస్ పౌడరు

చిన్న చిన్న లోపములను, కళంకములను కనపడకుండా చేయుటకు మరియు పౌడరును బాగా అంటుకొని ఉండేలా చేయుటకు మీ మనోహరమైన ముఖమునకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ కావాలి!

మీ ముఖ చర్మమును గంటల తరబడి ఎంతో ఆకర్షణీయముగా ఉంచుటకు పాండ్స్ ఫేస్ పౌడరు కావాలి!

పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును మరియు ఫేస్ పౌడరును రోజూ వాడుకోండి!

ప్రపంచమంతటా సౌందర్యవతులు
వీటినే ఎన్నుకొంటారు

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో సంస్థాపించబడినది)



# వనితల మనస్తత్వాలు

చాలామంది ఎవరివిషయమైనా మాట్లాడు తుంటూ వుంటే, అది అతని అలవాటని, లేకపోతే ఆమె అలవాటని అంటారు. నిజానికి ఈ అలవాటుకి అర్థం అనేవారికి కూడా తెలియదనే నా వుద్దేశ్యం...

కొందరు వనితలు తెల్లవారుజామున లేచి, పాచిపని మొదలుకొని, ఫలహారాల దాకా చకచకా చేసి భర్తను ఆఫీసుకి పంపించేవారుంటారు. మరి కొందరు వనితలుంటారు చూడండి. ఎనిమిదిగంటలైనా నిద్రలేవక, భర్త ఏమైనా అంటే, "అబ్బ మీకే ఆడవారైతే తెలుస్తుంది కష్టం" అంటూ విసుగుతారు. పాపం ఆ భర్తకు ఏమనాలో తోచక డ్రస్ వేసుకొని, కాఫీ హోటళ్ళకు బయలుదేరుతాడు. నిజానికి అతగాడి తప్పేముంది చెప్పండి. ఇంట్లో అన్నీ సమకూరితే పైన ఎందుకు దుబారా చేస్తాడో మీరే చెప్పండి. పైగా ఆ ఆడవారే అంటారు. "మా ఆయనకు బొత్తిగా ముందూవెనక తెలియదమ్మా ఏరోజు రూపాయి ఆరోజే" అని సంసారం ఒడుదుడుకులు లేకుండా సాగిపోవాలంటే భార్యభర్తల అనుకూలతమీదే ఆధారపడి వుంటుంది. ఇందులో ఏ ఒక్కరు పెడమొగం పెట్టినాగానీ ఆనందం, సుఖం సున్నా.

అందాకా దేనికి చూడండి; మా ఇంటి పక్కన ఒకావిడుంది; భర్తకు తెలియకుండా బజారుకెళ్ళి ఎన్నో చీరెలు సారెలు కొనుక్కొస్తుంది. భర్త అవి ఎందుకే, తింటానికి సరిగా వుంటే చాలదా అంటే "నేను మీ ఇంటికి చాకిరీ చేయడానికీను, తిండి లేక రాలేదు" అంటారు. చూడండి. ఈమాటలకు ఏమైనా అర్థం వుందా. వనితలు తమ అభిప్రాయాలకే చోటిస్తారుగాని, ఎదుటివారు మంచి చెప్పినా చెడు చెప్పినా గానీ, ఆలోచించే వ్యవధిలేకుండా ప్రవర్తిస్తారు. సంసారం సుఖవంతం కావాలంటే; భర్త ఒకడే ఆరాటపడితే లాభంలేదు, నిజానికి ఇద్దరి అన్యోన్యతను కలబోసి, సారాన్ని సంసారనావకు ఇంధనంగా పోసిననాడే, నావ సుఖవంతంగా సాగిపోతుంది.

కొంతమంది, పిల్లలిని కొడితేనే గానీ, ఏ పనీ వారిచే చేయించరు. ఇక 'అదేమిటే నీకేమన్నా పిచ్చ బాద స్తమా' అని భర్త అంటే, "మీకు తెలియదు. మీరూరుకోండి అని విసుక్కుంటారు. ఇంకా ఏమైనా మాటంటే, పప్పులో ఉప్పుండదుకదా; సరిగా వేళకి ఆఫీసుకికూడా వెళ్ళలేడు భర్త. చూడండి వనితల అలవాట్లకు ఎట్టి అనర్థాలొస్తున్నయో,

ఇక మంచి అలవాట్లుంటారా బాగానే వుంది. పొదుపుచేసి, ఒడుదుడుకు లేకుండా, సంసారసాగరాన్ని ఈదుతుంటే, ఆనందం తప్ప ఇంకేముందో మీరే చెప్పండి. భర్త ఆఫీసునుంచి రాగానే ఛీపణ వీక్షణాలతో ఆయనమనస్సు కష్టపెట్టేవారుంటారుకూడా, ఎట్లాగంటారేమో, "ఏమండోయ్ చూశారు, మనపక్కింటావిడ, రవ్వల నెక్‌లేసు కొన్నదండి, ఎంతబాగుందని, అబ్బ చూడముచ్చటగావుందండీ, అటువంటిది నాక్కూడా... అంటూ ఆమాట పూర్తిచేయకముందే భర్త విసుగుచెందుట గుర్తించి, మీ రెప్పుడూ ఇంతే లెండి ఓ అచ్చటా ముచ్చటా ఈ బ్రతుక్కి" ఎప్పుడూ ఆఫీసు, తిండీ, తప్ప మీకేంపట్టినట్లులేదు; అంటూ మండుతూన్న అగ్నిలో ఆజ్యంపోసేవారున్నారు, లేదనకండి.

అసలు విషయం చెప్పాలంటే, ఏ భర్తకు తనభార్యకి నగలుండాలనుండదు; మంచి జార్జెటు చీర లుండాలనుండదు. కానీ అదినెరవేరక అతను మధనపడే, ఆవేదన అర్థం

## "భాగ్యం"

చేసుకోలేని, వనితాలోకం వుంది చూశారు, ఇంకెందుకు వారి అలవాట్లకి వీరి హృదయాలను బలి చేస్తారు. ఏనాడైతే అర్థంచేసుకొని, మసలుతారో జీవితము ధన్యమే కదండి మరి.

మరి కొందరు, వనితలుంటారు చూడండి, భర్త 'నగానట్రో, చీరాసారో తెచ్చాడనుకోండి, దానికి లేనివంకలుపెట్టి వారి ఉత్సాహాన్ని ఖూనీచేసేవారున్నారు, లేకపోలేదు. బహుశః వారు అట్లా ప్రవర్తిస్తేగాని సంతృప్తివుండదనుకుంటా, చివరికి ఆవస్తువునీ ఉపయోగిస్తారు సుమండీ, కొంపతీసి అవతల పారేస్తారనుకోకండి, అలాచేస్తేకూడా అదో రకంగా వుంటుంది. చూడండి ఈ పని ముందుగానే చేస్తే భర్త మనస్సు ఆనందడోలికలలో ఎలా వూగిసలాడుతూందో మీరే వూహించండి. అటువంటి గుణంపోవాలంటే అతికష్టం.

ఇక కొందరుంటారు. పరిస్థితులను అర్థం చేసుకోకుండా "ఏమండీ చూశారూ. ఆ శాంతమ్మ లేదూ...ఆమె భర్త చూడండి. ఎంత టిప్‌టాప్‌గా వుంటాడో, ఆ వులన్ సూట్ వేసుకొని...టైకట్టి...చలువ జోడు పెట్టి..." అంటూ ఇంకా ఎన్నో చెప్పుకుపోతారు. "పరిస్థితులను బట్టి గదా మనం బ్రతకాలి" అంటే భర్త..."ఎప్పుడూ వుంది లెండి" అంటూ వాపోతారు.

భర్తకుమటుకు వుండదా చెప్పండి— మంచి సూట్ వేసుకొని, కార్లో తన సతీమణితో షికారుకెళ్లాలని. కుటుంబ అంతస్తును అవగాహన చేసుకొన్నవారసలు అట్టి ఆలోచనలను రానివ్వరు. అట్టి కోరికలు లేకుండా, సామాన్య జీవితాన్ని గడుపుతూంటేనే ఆనందం తప్ప ఇంకేముందండి.

అర్థాంగి అంటే శరీరంలోసగం కాదు సుమండీ. కష్ట సుఖాలలో కూడా భాగస్వామ్యన్న సంగతి మరువకూడదు. భర్తకు అనుకూలముగా వున్ననాడే జీవనయాత్ర జయప్రద మవుతుంది.

ఇక కాస్తోకూస్తో చదువుకున్న వనితలైతే వారికుండే అలవాట్లు వారికుంటై. రోజూ న్యూస్ పేపరు మీదగాని, ఇంకా ఏ వార పత్రికలమీదనో తెగ పిచ్చిగల వాళ్లుంటారు. అటువంటి వాళ్ళున్నారు చూశారు; "ఏమండీ ఈ రోజు ఆదివారం కదండి, కాస్త బజారు కెళ్ళి హిందూ పట్టుకురండి" అంటారు. ఆ పేపరంటే మండిపడే భర్తయితే "ఇంకా నాలుగు వీక్లీసు తెస్తాను, ముందేసుకు కూర్చో" అంటూ విసుగు చెందుతాడు.

ఇక ఆ సతీమణిగారు కంటిధారలతో ఆ చిన్న వస్తువుకి రాద్ధాంతం చేసేవారున్నారు. ఇంకా పైగా ఇలా వాపోతారు: "ఏదో చదువుకున్నా కాబట్టి...అంత మీకు ఖర్చయితే...ఏ చదువురాని మొద్దునో చేసుకోక పోయారు."

ఈ మాటలకు ఏ కోశానయినా అర్థమనేది గోచరిస్తుందేమో మీరే ఆలోచించండి; చదువుకున్నంత మాత్రాన వనితలలా ప్రవర్తించటమనేది ఎంత అనర్థమో చూడండి.

భర్త...వివాహానికి ముందు, చదువుకున్న భార్యయితే ఇంటిని చక్కగా సర్దుకుపోతుందని, పిల్లలకు సరైన ట్రెయినింగ్ ఇస్తుందని అనుకుంటాడే గాని...ఇలా భావిస్తాడా, మీరే చెప్పండి.

ఈ చిన్నవాటితోనే కాక భర్తని ఇంగ్లీషు సినీ కి బలవంతం చేసేవారుంటారు. భర్త ఏ పెద్ద ఆఫీసరో చేస్తే సరేసరి...ఇక ఎటువంటి నాటకమైనా ఆడోచ్చు. కానీ గుమాస్తాచేసే భర్తయితే ఈ అప్లికేషన్లకన్నిటికి యెలా సంతకం పెడతాడో మీరే చెప్పండి.

అట్టి వనితల కొన్ని అలవాట్లున్నా గానీ పరిస్థితుల నర్థం చేసుకొని మెసిలితే, భర్త ఎంత ఆనందిస్తాడు, జీవితం ఎంత ధన్యమవుతుంది. సంసార సాగరాన్ని సులాసాగా యీదుకు పోవాలంటే భార్యాభర్తల అన్యోన్యతే కదండి. అలా చేసిననాడే మధ్యతరగతి కుటుంబాలు పైకి రాగలుగుతాయి. ★

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి

# రోజంతా నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి!

అందు చేతనేనా: ఒకసారి తోముకుంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 వంతుల వరకు దంతక్షయము లేకుండా చేసి, దుర్వాసన పోగొడుతుంది.**

భోజనం చెయ్యగానే కాల్గేటును ఉపయోగించి బ్రష్‌తో పళ్ళు తోముకొన్నట్లయితే అనేకమందికి దంతక్షయం కావడం ఆగి పోతుందని, దంత వ్యాధుల చరిత్రలో ఇది అపూర్వ విషయమని, శాస్త్రీయ పరిశోధన వల్ల ఋజువైంది. అంతేకాదు. నోటినుంచి దుర్వాసన వచ్చేవారు దీనిని వాడినట్లయితే 10 మందిలో 7 మంది కైనా వెంటనే గుణమిస్తుందనికూడా ఋజువైంది. ఒక్క కాల్గేట్ విషయంలోనే ఇవి ఋజువైనవి.

కాల్గేట్‌నుంచి నురనురగమంటూ వచ్చేనురగ పళ్ళ సందుల్లోకి లోపలికంటా చొచ్చుకుపోయి, అక్కడ కుళ్ళి పోయి ఉండే ఆహార పదార్థాల కణములను బయటికి గిలా వేస్తుంది. పళ్ళు చాలా చెడి పోడానికి, దుర్వాసన రావడానికి కారణం ఆ కణములే.

కాల్గేట్‌తో పళ్ళు తోముకొనడమంటే పిల్లలకు చాలా సరదా, ఎందుకంటే దానినుంచి వచ్చి చాలా సేపు ఉండే పిప్పరమెంటు వాసనంటే వాళ్ళు చెవి కోసుకుంటారు.






మీకు పళ్ళపొడి అలవాటైతే, కాల్గేట్ పళ్ళపొడివల్లకూడా ఇన్ని లాభాలూ ఉన్నాయి ...... ఒక డబ్బా కొన్ని నెలలు వస్తుంది।

కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతక్షయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం....ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

DCB. 1907 T


బొమ్మల కథ
ఆగు


పారిపోయిన శవం!
బి.వి.సత్యమూర్తి


పోలీసుని మొహంమీద బండతో, ఆనవాలు లేకుండా కొట్టి చంపేస్తాడు


ఈ లోగా ఆ రోడ్డుకి ఇటు నించి అటునించి రెండు పోలీస్ వేన్లు వస్తుంటాయి


అరె పోలీసులు వచ్చేస్తున్నట్లున్నారు ఎలాగ...?


ఆ వేన్లు దగ్గర కొచ్చేలోపల హంతకుడు పోలీసు యూనిఫారమ్ చేత బట్టుకుని, పక్క పొదల్లోకి పారిపోతాడు


ఇంతలోకి రెండు వేన్లు, శవాలు పడి ఉన్న చోటుకి వచ్చి ఆగాయి


ఇక్కడ కాపలా ఉంచిన హెడ్-కానిస్టేబుల్ ఏడి?
ఏమిటో విచిత్రంగా ఉంది సార్ ఇందాకా ఇక్కడే ఉన్నాడు. సార్ సార్ ఇందాకా నేను చూసింది శవం కాదు సార్. అసలు శవం పారిపోయింది సార్

# తోడేలు - మేకపిల్ల

ఒకానొక గ్రామములో ఒక మేక పిల్ల కలదు. అది ప్రతి దినము తల్లితోపాటు దగ్గరలో ఉన్న అడవికి వెళ్ళుతూ ఉండేది. ఒక రోజున అది ఆ అడవిలో త్రోవ తప్పినది. తిరిగి తిరిగి అలసిపోయినది. త్రోవ తెలియలేదు. అంతేగాక చాలా దప్పిక గొనినది. ఇంతలో దానికి ఒక రమణీయమైన తటాకము కన్పించినది. మంచినీరు త్రాగుదమని దాని లోనికి దిగినది. ఇంతలోనే ఎట్లా వచ్చినదోగాని ఒక మాయదారి జిత్తులమారి తోడేలు కూడా అక్కడకు దప్పిక తీర్చుకొనటానికి వచ్చినది. మేకపిల్లను చూడగానే దానికి దానిని చంపి తినవలెనను దుర్బుద్ధి పుట్టినది.

ఏదో విధముగా దానితో తగువు పెట్టుకొని దానిని చంపుదమని తలచి తోడేలు మేకపిల్ల వద్దకు వెళ్ళి "ఏయ్ మేకపిల్లా! ఈ చెరువు నాది. నా ఆజ్ఞ లేకుండా నీరు త్రాగుచుంటివి. అదియునుగాక నీటిని మురికి చేయుచున్నావు. కావున నీవు శిక్షార్హుడవు. తప్పక నిన్ను శిక్షించెదను" అని గర్జించినది.

తోడేలు మాటలకు మేకపిల్ల జడియక చిన్నగా "నేను ఒడ్డున నుండియే నీటిని త్రాగుచున్నాను. ఏమీ మురికి చేయుట లేదు. అయినను ఈ చెరువు అరణ్యములోని జీవకోటి అంతకు సంబంధించినదిగాని కేవలము నీ ఒక్కడిది మాత్రమే కాదు. కావున నీ అనుజ్ఞ అనవసరము" అని జవాబిచ్చినది.

మేకపిల్ల మాటలకు తోడేలు విస్తుపోయినది. అంతగట్టిగా సమాధానం వస్తుందని ఊహించనే లేదు. దానిని చంపవలెనను పట్టుదల హెచ్చినది. కోపం కూడా వచ్చినది. "మేకపిల్లా! నీవు ఆరు నెలల క్రితము నన్ను తిట్టినావని నాకు తెలిసినది. ఎందుకు తిట్టితివి? దీనికి సమాధానం చెప్పు. లేనిచో నిన్ను చంపివేయగలను" అని చెప్పినది.

పెనుగొండ
వెంకటసుబ్బారావు

తోడేలు మాటలకు మేకపిల్ల మదిలో భయపడినది. కాని దానిని బయటకు కనపరచకుండా సౌమ్యముగా "ఇప్పుడు నా వయసు నాలుగు నెలలు, ఆరునెలల క్రితం నేను పుట్టనైనా పుట్టలేదే! నిన్ను నేను అప్పుడెట్లు తిట్టగలను? న్యాయం నీవే చెప్పు" అని ప్రాధేయపూర్వకంగా అడిగినది.




మేకపిల్ల ప్రశ్నకు తోడేలు తికమకపడినది. మేకపిల్ల మాటలకు జాలికి బదులుగా కోపం అత్యధికంగా వచ్చినది. మేకపిల్లతో వాదించి గెలవలేనని తలచి "ఇదిగో మేకపిల్లా! నీవు గాకపోయిన నీ తల్లి నన్ను తిట్టియుండవచ్చును. అది దొరకనందున దానికి పుట్టిన నీవు అనుభవించక తప్పదు శిక్ష" అనుచూ మేకపిల్లను మాట్లాడనీయకుండా చంపబోయెను.

అసలే దడుస్తూ ఉన్న మేకపిల్ల తోడేలు అఘాయిత్యానికి భయపడి ప్రాణాలపై ఆశ వదలుకుంది. కాని ఇంతలోనే దాని చిన్ని బుర్రలో ఒక గొప్ప ఉపాయం తళుక్కున మెరిసినది. వెంటనే అది తోడేలుతో మృదువుగా "బావా! ఆగాగు! నాకు ప్రాణాలపై ఆశ ఏమీ లేదు. చావబోయేముందు కోరిక లేమీ ఉండరాదని పెద్దలు చెపుతారు. నా కొక చిన్ని కోరిక ఉంది. నా యీ చిన్ని కడసారి కోరిక దయచేసి తీర్చిచంపు" అని దీనంగా బ్రతిమాలినది.

మేకపిల్ల మాటలకు తోడేలు కొద్దిగా జాలిపడినది. దాని కోరిక తీర్చకపోయినను తెలుసుకున్నంతలో వచ్చే నష్టం లేదనుకుని అదేమో తెలుపమని మేకపిల్లను తొందర పెట్టినది.

దానికి మేకపిల్ల "మరేమీ లేదు తోడేలు బావా! నీవు గొప్ప సంగీత విద్వాంసుడవని నీ గాన మాధుర్యమును గూర్చి అందరు గొప్పగా పొగడుతుండగా విని యున్నాను. నీ పాట వినవలెనను కోర్కె నాకు చాలాకాలంనుండి ఉన్నది! ఒక్కపాట పాడి నా అంతిమ



కోర్కె తీర్చు"మని దానిని వాగడుతూ అడిగినది.

మేకపిల్ల పొగడ్తలకు బాగుగా పొంగిపోయి తన గానమాధుర్యము, సంగీతప్రభావము ప్రపంచమంతటా ప్రాకినదగదా అని గర్వపడి గొంతు సవరించుకొని కూతలు వేయ నారంభించినది తోడేలు.

అది విని మేకపిల్ల "ఆహా! ఎంత తీయగా ఉంది నీ మృదుమధుర సంగీతం. నా మనస్సు తేలికపడింది. చనిపోతున్నాననే విచారమేమీ కలుగుటలేదు నాకు. కాని ఇంకా గొద్దిగా గాత్రం హెచ్చించిన మరింత బాగుండేటట్లుగా ఉన్న"దని చెప్పి తోడేలును బాగుగా ఉబ్బించినది.

వెర్రి తోడేలు మేకపిల్ల హృదయం అర్థం చేసుకొనలేక పైపై మాటలకు బాగుగా ఉబ్బిపోయి అది చెప్పినట్లు మరింత గట్టిగా కేకలు వేయ నారంభించినది. దీని కేకలు విని ప్రక్క గ్రామంలోని కుక్కలు రయముగా రాసాగినవి. పిచ్చి తోడేలు పాటల హుషారులో వాటి రాకనే గమనించలేదు.

మేకపిల్ల కుక్కల రాకను గని భయాతిరి గట్టిగా ఊపిరి పీల్చింది. వెంటనే అది తోడేలుతో హేళనగా "బావా! ఎంత మృదుమధురంగా పాడుచున్నావు. నీ గానకళా ప్రదర్శనమునకు నా మిత్రరత్నములు శునకరాజములు వచ్చుచున్నారు. వారు నిన్ను ఉచిత రీతిని సత్కరించెదరులే. సంగీత విద్వాంసుడ వంటే నీవేనయ్యా" అని వ్యంగ్యముగా పల్కుచు బావ కబురు చల్లగా చెప్పినది.

వాని మాటలకు తోడేలుకు ఒక్కసారి గుండె ఆగినంతపనైంది. పాడలి పోయి చిక్కుబలం చూపబోయినది గాని కుక్కలు వదిలితేనా! అవి తోడేలును చీకి పాకంపట్టి పరలోకానికి పంపించినవి.

తోడేలు బారినుండి తప్పించుకున్న మేకపిల్ల కుక్కలతో కలిసి తన గ్రామం చేరి తన తల్లివద్దకు వెళ్ళి "మేమే" అన్నది.

చూశారా మరి! సమయస్ఫూర్తితో ప్రాణాపాయంనుండి తప్పించుకున్నది మేకపిల్ల. ముఖస్తుతి మాటలు నమ్మి ప్రాణాపాయం కొని తెచ్చుకున్నది తోడేలు. ★

# పి చ్చి వా డు

"రవీ, రవీ" అని ఎవరో తలుపు తట్టారు.

ఎవరా అనుకుంటూ తలుపు తెరిచాను.

శంకరం. ఆశ్చర్యపోయి చూస్తున్నాను. ఎందుకో రొప్పుతుంటూ వస్తున్నాడు. "ఏమిటిరా, అలా రొప్పుతున్నావ్?" అన్నాను. మాట్లాడలేక పోతున్నాడు.

"లోపలకు రా" అన్నాను. లోపలకు వచ్చాడు. కాసేపు కూర్చున్నాక మొదలెట్టాడు.

"మ్యాట్నీ చూసి వస్తున్నానురా. కొంతదూరం వచ్చానో లేదో ఒక చెట్టు క్రింద ఒక పిచ్చివాడు కూర్చుని ఉన్నాడు. నన్ను చూసి నవ్వాడు. పోనీలెమ్మని ఊరుకున్నాను. నాదగ్గరకు రాబోయాడు. నేను పరిగెత్తాను. వాడు నా వెంటబడ్డాడు. ఈ సందు దగ్గరకు వచ్చేటప్పటికి వాడు నాదగ్గరకు వస్తున్నాడు. మీ ఇంటికి వద్దామా అనుకున్నాను."

"రాకపోయావా," నీతలకాయ. ఆలోచించవేమిటి?" అన్నాను మధ్యలో. "చెప్పేది వినరా" అంటూ ఇలా చెప్పాడు:

"ఇంతలో ఆ పిచ్చివాడు వచ్చి గట్టిగా పట్టుకున్నాడు. కేకేద్దామంటే దగ్గర్లో ఎవరూ లేరు. కేకేస్తే చంపేస్తాడేమో అన్న అనుమానం కూడా వచ్చింది. ఇంతలో పిచ్చివాడు నా జేబులో ఉన్న కాస్తా లాక్కొని పరుగెత్తాడు".

"ఇంతకీ పర్సులో ఎంతఉంది" అన్నాను.

"ఎంతలేకేం. పందరూపాయలూ చిల్లరా ఉన్నది" అన్నాడు.

"ఇప్పుడు ఆ పిచ్చివాడు ఎక్కడున్నాడు?" అన్నాను.

"అసలు ఎటువెళ్ళాడో కూడా చూడలేదురా. భయంవేసి పరుగెత్తుకు వచ్చాను" అన్నాడు.

"ఓరేయ్ అదిసరేగాని డిటెక్టివ్ నవలలు చదివి తెగగొప్పలు చెప్పేవాడివి, ఇప్పు డిలా భయపడతావేం?" అన్నాను

రంగనాయకమ్మ

"అది సరేరా. ఇప్పుడు ముందు సంగతి ఆలోచించు" అన్నాడు.

"అయితే నేనేం చేయను?" అన్నాను.

"అట్లా అంటావేమిట్రా, ఆ పిచ్చాడెవరో కనుక్కొని, డబ్బు వచ్చే ఉపాయంచూడు. ఇనస్పెక్టర్ గిరీ వెలగపెడుతున్నావు. ఆమాత్రం చేయలేవూ?" అన్నాడు.

"సరే. వెళ్ళొస్తానురా" అని లేచాడు శంకరం.

"మళ్ళీ ఆపిచ్చాడు పట్టుకుంటాడేమో జాగ్రత్త" అన్నాను.

"సరే"నంటూ వెళ్ళిపోయాడు.

* * *

మర్నాడు ఉదయం భోజనంచేసి అలా బయటకు వెళ్దామని బయలుదేరాను. వాకిట్లోకి వచ్చేసరికి అరుగుమీద ఒకడు కూర్చుని ఉన్నాడు. అగడ్డం, మాసినతల, చింపిరిగుడ్డలూ నిన్న శంకరం చెప్పిన పిచ్చాడు గుర్తుకువచ్చాడు.

"ఏమ్ నువ్వెవరూ?" అన్నాను ఎవరో తెలుసుకుందామని.

"నువ్వెవరూ?" అన్నాడువాడు.

నా కాశ్చర్యమేసింది. పిచ్చాడేమో ననుకున్నాను.

"నేను ఇన్స్పెక్టర్ని" అన్నాను.

"నేను డిటెక్టివ్ని" అన్నాడువాడు.

ఏమిటో తెలుసుకుందామని "లోపలకు వస్తావా" అనడిగాను. మాట్లాడకుండా నా కంటెముందే వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. నేను ఇంకో కుర్చీలో కూర్చుంటూ "నీ పేరేమిటి?" అని ప్రశ్నించాను. వాడు నావేపు కోపంగా చూశాడు. నే నేం తప్పుమాటన్నానా అనుకున్నాను. అయినా పిచ్చాడుగదా అని ఊరుకున్నాను.

"నాపేరు వీరయ్య" అన్నాడు.

"ఏ పని చేస్తున్నావ్?" అన్నాను.

"దొంగతనం" అని నవ్వాడు.

దొంగతనమా. ఇక్కడ ... ఎత్తుకుపోడుగదా అనిపించింది.

"ఇవ్వాళేమైనా చేశావా?" అనడిగాను. "ఇంకా ఎక్కడికీ వెళ్ళలేదు" అన్నాడు. "నిన్న ఏమైనా చేశావా?" అన్నాను.

"నిన్న నువ్వేమైనా చేశావా?" అన్నాడు. ఉలిక్కిపడ్డాను. ఏమని చెప్పను? "బంగారం" అన్నాను తమాషాకి.

కోపంతో లేచి నుంచున్నాడు. మళ్ళీ కూర్చున్నాడు. "నేను డబ్బు దొంగతనం చేశా"నన్నాడు.

ఒకవేళ శంకరం డబ్బు తీసింది వీడేమో నన్న అనుమానంకూడా వచ్చింది. అయినా శంకరాన్ని పిచ్చాడి అవతాలు అడగలేదుగదా అని ఊరుకున్నాను. ఇంతలో వాడు వెళ్ళిపోతున్నాడు. నేనులేచి వెళ్ళి

నే కేద్దా మనుకున్నాను కానీ ఇంతలోనే వాడు బయలుదేరి వెళ్ళి సందుమలుపు తిరిగాడు "ఏం చేయను" అని వచ్చి కూర్చున్నాను.

కాసేపట్లో శంకరం వచ్చాడు. "ఏరా నా మాటేం చేశావు?" అన్నాడు. "ఇప్పుడే పిచ్చివాడు వచ్చి వెళ్ళాడు గా. నీనుంచి ఆనవాలు తెలుసుకోలేను. ఒక్క నిమిషంముందు వచ్చినట్లయితే నువ్వు కూడా చూసేవాడివి" అన్నాను.

"పోనీలేగాని, వాడేమైనా చెప్పాడా? ఎల్లా ఉన్నాడు?" అని అడిగాడు.

"పెద్దగడ్డం, మాసినతల, చింపిరి గుడ్డలు అచ్చు పిచ్చాడిలాగానే ఉన్నాడు. పేరేమిటని అడిగితే 'వీరయ్య' అని చెప్పాడు. సరే ఈ ఊళ్ళోనే ఉంటున్నాడులా ఉంది. ఎలాగైనా తెలుసుకుంటాలే" అన్నాను. ఇంతలో మా చిన్ననాటి స్నేహితుడు వచ్చాడు "ఏమిట్రా" అంటూ. జరిగిన పిచ్చాడి కథంతా చెప్పాడు శంకరం.

"నీ కెక్కడైనా కనపడ్డాడా" అన్నా నేను.

"నా కెక్కడా కనిపించలేదురా" అన్నాడు సుందరం.

"సరేగానీ, పోయింది ఎంతడబ్బురా?" అన్నాడు సుందరం. "వంద రూపాయలు" ఏడుపుముఖం పెట్టి అన్నాడు శంకరం. సుందరం నవ్వాడు.

"ఏమిట్రా అలా నవ్వుతావ్?" అన్నాడు శంకరం.

"ఏం లేదురా, గొప్పలు చెప్పే వాడివి పిచ్చాడికి ఎలా లొంగావురా" అన్నాడు సుందరం. మాట్లాడకుండా ఊరుకున్నాడు శంకరం.

"రేపు నేను నాటకంలో వేస్తున్నానురా. మీ ఇద్దరూ తప్పకుండా రావాలి" అన్నాడు సుందరం.

"ఏం నాటకంరా?" అన్నా న్నేను ఆశ్చర్యపోయి. "పిచ్చివాడు," అని నవ్వి రమ్మని మరీ మరీ చెప్పి వెళ్ళాడు.

"ఏమిట్రా, ఎక్కడ చూసినా పిచ్చివాళ్ళు, పిచ్చివాళ్ళు" అన్నాడు శంకరం. నేను నవ్వి ఊరుకున్నాను కాసేపుండి శంకరం వెళ్ళిపోయాడు.

మర్నాడు నేను, శంకరం నాటకానికి వెళ్ళాము. నాటకం ప్రారంభమైంది. అందులో ఒకపిచ్చాడున్నాడు. ఒకణ్ణికొట్టి వాడి జేబులో పర్సు లాక్కుని పారిపోయాడు. శంకరం నావేపుచూసి నా చెవిలో, "మొన్న సరిగ్గా ఇలానే జరిగిందిరా" అన్నాడు.

"సుందరం నాటకంలో వేస్తానన్నాడు. వాడు కనపడలేదేం?" అన్నాడు మళ్లీ.

"వాడిపాత్ర రాలేదేమోరా. ఏమిటో నా కర్థంకావటం లేదురా" అన్నాను తికమకపడుతూ ఇంతలో నాటకం పూర్తయింది. వెంటనే స్టేజి మీదకు ఇందాకటి పిచ్చాడు వచ్చాడు. గడ్డమూ, తలపాగా (తలకేదో చుట్టుకున్నాడు) తీసేశాడు. నే నాశ్చర్యపోయి చూస్తున్నాను. శంకరం నోరు అలాగే తెరుచుకునే ఉండిపోయింది. ఒక తను లోపలకు పోదామా, వద్దా అని అటూ ఇటూ తిరుగుతోంది. ఇంతలో సుందరం మాదగ్గరకువచ్చి "ఎందురా అలాఆశ్చర్యపోతారు. ఒరే శంకరం ఇదిగో నీ వందరూపాయల నోటు" అని జేబులోనించి వందరూపాయలు తీసి శంకరానికి ఇచ్చాడు. శంకరం ఆ నోటుతీసి సుందరం జేబులో పెడుతూ "చాలా బాగా నటించావురా. ఈ నోటు తీసుకో" అంటూ ఆనోటు వాడికి ఇచ్చాడు.



## "ఇంటింటా స్వంత గ్రంథాలయం"

పుస్తకాలు అమ్మేవారికి వచ్చే ఉత్తరాలను బట్వాడా చేయుటకు కేంద్ర తపాలా కార్యాలయంలో ప్రత్యేక ఏర్పాటు జరగటం భారతదేశంలో ఒక విశేష వార్త అనవచ్చు. అల్లాంటి ఏర్పాటు ఒకటి సికింద్రాబాద్ తపాలా కార్యాలయంలో జరిగింది. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సుకు వచ్చే ఉత్తరాల బట్వాడాకు ప్రత్యేక ఏర్పాట్లు చేయవలసివచ్చింది. 1960 మే 1 నుంచి ఈ ప్రత్యేక అవకాశమునకు పెట్టినగడువు జూన్ 6 వరకు దాదాపు రెండువేలమంది ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళికకు చందాదార్లు అయ్యారు. ఇంత సంజాయిషీ వస్తుందని ఈ యోచన చేసినవారుకూడా అనుకోలేదు. జూలై 6 నుండి ఈ అవకాశమునకు గడువు పెంచవలసిందిగా కోరుతూ ఉత్తరాలు ఫోను మీద పిలుపులు విపరీతము అయ్యాయి. పాఠకుల కోరికను మన్నించి ఈ ప్రణాళిక నిర్వాహకులు 'ఇంటింటా గ్రంథాలయ' సరికొత్త ప్రణాళికలో చేరుటకు గడువును 1960 సెప్టెంబరు 6 వరకు పెంచుటకు నిశ్చయించారు.

ఈ ప్రణాళిక మరో విశేషం ఏమి తేలిందంటే గ్రామాలనుండి ఎక్కువమంది చందాదార్లుగా చేరారు. అంతేగాక చందాదార్లలో వివిధ వర్గాలవారు సినిమాతారలు, పండితులు, రైల్వేగార్డులు, న్యాయవాదులు, డాక్టర్లు, సంక్షిప్తలేఖకులు ఉన్నారు.

నెలకు అయిదే అయిదు రూపాయలతో ఆంధ్రప్రదేశ్ లోని పాఠక మహాశయులు తమ ఇష్టంవచ్చిన గ్రంథములతో గ్రంథాలయాన్ని ఏర్పాటుచేసుకునే సావకాశమే ఈ ప్రణాళికలోని ప్రత్యేకత అనవచ్చు. అంతేగాక ఇల్లాంటి ప్రయత్నం ఇదే ప్రథమమేమో కూడా నెలకు రు 5 లు అంటే రోజుకు మూడు అణాలుకూడా పడటంలేదు. ఈ ప్రణాళిక ననుసరించి పాఠకులు 18 నెలలు చందాదార్లుగా ఉంటారు. రు 90 ల పెట్టుబడికి వెయ్యి తెలుగు పుస్తకాల జాబితా నుండివచ్చిన పుస్తకాలు వంద రూపాయల విలువగలవి లభిస్తాయి. ఇంతే గాకుండా మరొక తొమ్మిది పుస్తకాలుకూడా బహుమతిగా లభిస్తాయి. అంతేగాక పుస్తక ప్రపంచం మాసపత్రిక తాలూకు 18 సంచికలు వరుసగా ఉచితంగా వస్తాయి. పైగా వీటన్నింటికి బంగీ రవాణా ఖర్చులను చందాదారు చెల్లించ నవసరంలేదు.

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సువారు యజమానులైన యం. శేషాచలం అండ్ కంపెనీ ఆంధ్రదేశంలో గత 88 సంవత్సరాలుగా ప్రముఖ గ్రంథప్రచురణ కర్తలుగా ఉంటున్నారు.



# చీడపురుగులు

(15-వ పేజీ తరువాయి)

డబ్బు చీరవాళ్లో పెట్టి తాళంవేసింది. సుందరమ్మకు చీరబావకు పోలిక ఇచ్చెయ్యడానికి వెళ్లింది. అది పుచ్చుకుంది సుందరమ్మ. "రాధమ్మా నీమేలు మరచిపోలేను. ఆ బంగారుచేత్తో మరో పోలిక, చాలా అవసరం, నామాట తీసేయవని నాకు తెలుసు" అంది. సుందరమ్మ అడగటం తడవుగా, బాగుండదని తీసిఇచ్చింది రాధ, మరొక పోలిక సుందరమ్మకు.

సాయంత్రం చీకటిపడుతూంది. సుందరమ్మ 50 రూపాయలు ఇవ్వటం జరిగింది. జీతంలో ఇక 80 రూపాయిలు మిగిలాయి. భర్త ఏమంటాడో అని భయంలేకపోలేదు రాధకు. రామ్మూర్తి భోజనానికివచ్చాడు. "కంచెంబు తీసుకురా"! అని గట్టిగా అన్నాడు: కంట తడిపెట్టి, "బద్దలైం"దని చెప్పింది రాధ. కోపం, విచారం ఒక్కసారి కలిగాయి రామ్మూర్తికి. బ్రతుకలేక బ్రతుకుతున్న తనలాంటి గుమాస్తా మళ్ళా కొనగలడా తిరిగి తన జన్మలో అని గట్టిగా రాధను మందలించాడు: "దానికేం తెలియదు. ఆ పొరపాటు నాది నాయనా" అని మజ్జిగ గిన్నెతో ప్రవేశించినసుందరమ్మఅంది. "మీరువెళ్లండి" అని చెప్పేసరికి, సుందరమ్మ ఇంటికివెళ్లి పోయింది. రాధకు కోపమూ, ఏడుపూ రెండూ ఒక్కసారి వచ్చాయి. తనకీఇంట్లో ఆమాత్రం స్వతంత్రంలేదా, అని వెక్కివెక్కి ఏడ్చింది రాధ. "నీకు ముందేచెప్పాను. సుందరమ్మ ఒకచీడపురుగని" అంటూ చెయ్యికడుక్కొని లేచిపోయాడు రామ్మూర్తి.

తెల్లవారింది: "అన్నయ్యా, కాలేజీ జీతంకట్టాలి, ఇవాళే ఆఖరుతేదీ" అన్నాడు వేణు. "మీవదిన తీసిపెట్టుంది అడిగి 50 రూ. తీసుకో" అన్నాడు రామ్మూర్తి. "వదినా, అన్నయ్య 50 రూపాయలు నా జీతంకట్టడానికిఇమ్మన్నాడు" అని అడిగాడు వేణు. రాధకు మరికొంచెం ఏడుపు వచ్చింది. "నేను చీరకొనుక్కున్నాను. 80 రూపాయలే ఉన్నాయి" అంది రాధ. "50 రూపాయలు ఏంచేశావు" అని చెంపమీద కొట్టాడు రాధను రామ్మూర్తి. సుందరమ్మకు ఇచ్చినట్టు వెక్కివెక్కి ఏడుస్తూచెప్పింది రాధ.

"ఇప్పుడు వేణూ జీతం కట్టకపోతే వాడి బ్రతుకు ఆలోచించావా" అని ఏడ్చాడు రామ్మూర్తి.

రాధ గబగబా వెళ్ళి డబ్బు ఎలాగైనా ఇచ్చేయమని బ్రతిమలాడింది. "అమ్మా నీకన్నా నాకెవ్వరున్నా"రని తనూ, కంట నీరు పెట్టుకుని "లేదమ్మా, ఉంటే, ఇంత సేపా" అని గొంతులో కళ్లుతుడుచుకుంది సుందరమ్మ.

ఆనాడు భార్యాభర్తలు మాట్లాడుకోలేదు. "వేణూ, ఈ కాఫీ ఆయనకు ఇచ్చేయి" అంది రాధ. "నాకు కాలేజీకి టైమ్ అయింది. నువ్వు ఇచ్చేయి వదినా" అన్నాడు వేణూ. కోపంతో కాఫీ అక్కడ పెట్టి వెళ్ళిపోయింది రాధ. "ఒరే వేణూ, ఈ వేళ భోజనం చెయ్యనురా", అని ఆఫీసుకు పోయాడు రామ్మూర్తి.

ఆ వేళ వేణూ కాలేజీకి సెలవు. ఈ గాలి దుమారానికి కారణం సుందరమ్మే అని పూర్తిగా గ్రహించాడు వేణు. రాధదగ్గరకు వెళ్లి "ఏం వదినా, అలా గున్నావు", అన్నాడు. రాధ మాట్లాడలేదు. "అంతా నాకు తెలుసును. కానీ నువ్వు చాలా అమాయకురాలివి. ఆ సుందరమ్మ, పచ్చగా ఉండే కుటుంబాలలో వైషమ్యం కల్పించే సంఘంలోని ఒక చీడపురుగని, నేనూ అన్నయ్యా చెబితే విన్నావా? ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. ఆలోచించు. మరచెంబు తగువు ఎవరివల్ల వచ్చింది? చీరతగవు ఎవరివల్ల వచ్చింది? నువ్వు అబద్ధమాడటం ఎవరివల్ల జరిగింది? చెప్పవదినా, చెప్పు," అన్నాడు వేణూ,

వేణూ, రామ్మూర్తి దగ్గరకువెళ్లి, ఉన్న సంగతిఅంతా చెప్పాడు. వదినను క్షమించమని, ఆమెకు సుందరమ్మ విషయం తెలిసి వచ్చిందని చెప్పాడు రామ్మూర్తితో. "అయితే మీ వదిన ఆమె శిష్యరికం మానేస్తుందా?" అని అడిగాడు రామ్మూర్తి.

"ఇప్పటికైనా బుద్ధిరావద్దా", అని ముసిముసి నవ్వులు ఒలికిస్తూ వచ్చింది రాధ.

సుందరమ్మవచ్చి, 'రాధా' అని పిలిచింది, "ఇక మీరు మా ఇంటికి రానక్కర్లేదు" అని చెప్పి పంపేసింది సుందరమ్మను. "అన్నట్లు దీపం చూపించు వేణూ, ఆవిడ వెళ్లి పోతారు" అంది రాధ. "అన్నట్టు వేణూ, ఈ చీర ఆవిడకిచ్చేయి. పాపం, ఇది వాళ్ళకోడలిదట, అకస్మాత్తుగా వాళ్ళింటికి వెళ్ళినప్పుడు తెలిసింది. ఇంకా ఆవిడ కనుక నయం మెల్లగా చెప్పింది", అంది రాధ. ★

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

సిఫార్సులే. కాని ఆ నిర్ణయాలు అమలుపరచడానికి ప్రభుత్వం బడితే ఉపయోగించడానికి వెనుకంజ వేయడంలేదే!

మరొక అంశంకూడా పరిశీలనార్హమైనది. కేంద్ర కార్మికశాఖ మంత్రి ఏ హోదాలో కార్మిక మహాసభలకు అధ్యక్షత వహిస్తున్నారు అనేదే అది. ఆ మహాసభలతో ప్రభుత్వానికి ఉన్న సంబంధం ఎలాంటిది? కేంద్ర మంత్రి చర్చలలో పాల్గొనేటప్పుడు ప్రభుత్వ వైఖరి వివరించి తదనుగుణంగా వ్యవహరిస్తారా? లేక వ్యక్తి స్వామిక రంగంలోని సంస్థల యజమానులను లొంగదీయడానికి తగు ఉపాయాలు అన్వేషించడమే ఆయన కర్తవ్యమా? ఈలాంటి త్రైపాక్షిక సమావేశాల పట్ల ప్రభుత్వ వైఖరి సుస్పష్టంగా విశదీకరించవలసిన సమయం వచ్చింది.

తృతీయ ప్రణాళికలో కార్మిక విధానం వివరించే ప్రకరణంబట్టి కూడా అవసరాలకు అనుగుణంగా వేతనాలు నిర్ణయించే సూత్రానికే ప్రభుత్వం ఇంకా కట్టుపడే ఉన్నది. అయితే సమ్మెదారుల నాయకులు నెలకు 125 రూపాయల కనీస వేతనం ఇవ్వమని ఈనాడు కోరడంలేదు. సిద్ధాంతం అంగీకరించి పేరుకు వేతనాలను పెంచమని మాత్రమే వారు కోరుతున్నారు. ఈ విధంగా తృతీయ పంచవర్ష ప్రణాళిక సహితం ప్రభుత్వ సిబ్బంది వాదాన్నే బలపరుచుతున్నది. ప్రభుత్వమైనా, శ్రీ నందా అయినా ప్రణాళికా బద్ధమైనవిధంగా అభివృద్ధి కార్యక్రమాలు అమలు పరచడానికి అయినా కట్టుపడి ఉండాలి: లేక ప్రణాళికకు పట్టుగొమ్మలు అయిన సిద్ధాంతాలకు అయినా కట్టుపడి ఉండాలి. రెండూ కావాలంటే సాధ్యంకాదు. సిద్ధాంతాలే కావాలంటే మాత్రం తత్పరిణామాలకు సిద్ధపడి ఉండడం ఆవశ్యకం. అవసరాలకు అనుగుణంగా వేతనాలు నిర్ణయించడమనేది వాటిలో ఒకటి.

కనీస వేతనాలచట్టం క్రింద కనీస వేతనాలు రేట్లు నిర్ణయించే అధికారం ప్రభుత్వానికి ఉన్నది. పారిశ్రామిక కార్మికులకు సంబంధించినంతమట్టుకు కనీస వేతనాలు నిర్ణయించడానికి ఆధారమైన సూత్రాలను సరసవేతనాల సంఘం రూపొందించినది. వారి కొరకు బోనసుసంఘంకూడా నియమించడం అవశ్యం జరుగుతుంది. కాని వ్యావసాయిక కార్మికుల విషయంలో ప్రభుత్వం భిన్నమైనవైఖరి అవలంబించినది. వారి అవసరాలపట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపవలసిన అవసరం ఉన్నదని మాత్రమే ప్రభుత్వం గుర్తించినది. దానిలో ఎక్కడా ఖాదీ,

చేనేత పారిశ్రామికుల వేతనాల ప్రసక్తి కూడా లేదు.

శ్రీ నందా బట్టల మిల్లుల వేతనసంఘం నిర్ణయాలను ఖాదీ పారిశ్రామికులకు ఎందుకు వర్తింపచేయలేదు?

కార్మిక సంఘాలనుంచి కార్మిక వర్గానికి చెందనివారిని తొలగించాలనేది రెండవ ప్రణాళికలో జరిగిన ప్రధానమైన సిఫారసు. ఇంతవరకు దానిని ఎందుచేత అమలుపరచలేదన్నది ప్రశ్న. శ్రీయుతులు నాథ్ పాయ్, డాల్వి, అల్వారెజ్, జోషీ ప్రభృతులు ప్రభుత్వోద్యోగుల సంఘాలు ఏర్పరచి ప్రభుత్వాన్నే స్తంభింపజేయడానికి అనుమతించిన దెవరు?

దానిని అమలు పరిచితే శ్రీ నందాను కలుపుకొని కాంగ్రెసు కార్మిక నాయకులు అందరికీ ఉద్వాసన చెప్పినట్లు అవుతుందని భయమా? ★

# నవనవలాడే 'లవ్ ఇన్ సిమ్లా'

కనువిందైన ఛాయాగ్రహణం, వీనుల విందైన సంగీతం రెండూ కలిసి హాయిగా మూడు గంటల కాలక్షేపం చేసే చిత్రం 'లవ్ ఇన్ సిమ్లా'. అందుకు తగ్గట్టు చక్కని ఔట్ డోర్, ఇన్‌డోర్ దృశ్యాల సమీకరణం కూడా ఇందులో ఒక ప్రత్యేకత.

ఒక పదహారేళ్ళ బాలాకుమారి తాను మోటుగా ఉండి నీటుగా లేదని తన సోదరిని ప్రేమించి పెళ్ళాడాలనుకున్న నవనాగరిక యువకుణ్ణి తన లావణ్యంతో జయించి తన వాడినిగా చేసుకున్న కథ 'లవ్ ఇన్ సిమ్లా'. కథ మనకు కొత్తదిగా ఉంటుంది. హాలీవుడ్ కథను హిందీలో తీసి మనకు చూపుతున్నట్లుంటుంది.

కొత్తవాళ్ళకు అవకాశమిస్తే చిత్ర పరిశ్రమ నష్టపోతుందంటూ కారణాలు ఏకరువు పెట్టే పింఛనుదారులు ఒకవైపున ఇంకా ఉన్న కాలంలో మరోవైపున కొత్త నటులతో కొత్త పోకడలతో చిత్రాలు నిర్మిస్తున్నారు. 'లవ్ ఇన్ సిమ్లా' లో నటించిన కొత్త జంట సాధనా, జాయ్ ముఖర్జీ మంచి నీళ్ళ ప్రాయంగా నటించారు.

చిత్రంలో సంగీతం శ్రవణానందంగా ఉంది. కథానాయకుడు సిమ్లా రైల్లో వస్తున్నప్పుడు రైలు 'గుప్ గుప్' తో శ్రుతి కలిపిన పాట మన సంగీత దర్శకులకు ముందుకు పోవటానికి బాట కాదగ్గది. ఇక్బాల్ ఖురేషీ అనే క్రొత్త సంగీత దర్శకుడు పాటల్లో మాటల్ని రాగంలో రక్తికట్టేలా రంగరించాడు.

ఛాయాగ్రహణం కళ్లు చల్లబడేలా ఉంది. హాల్లోంచి బయటికి రాగానే ఈ మూడు గంటలు సిమ్లాలో ఉండి రాలేదు కదా అనిపిస్తుంది.

అయితే బ్యాలేకంపెనీలూ, బాల్ రూమ్ డ్యాన్సులూ మరీ మితిమించిపోయాయి. క్లయిమాక్సు దృశ్యం 'లైలా మజ్నూ' ఎడారి దృశ్యంలా రూపొందించారు. 'లవ్ ఇన్ సిమ్లా' నవనవలాడే చిత్రం చిత్రమైన చిత్రం. ★



సుభిభ ప్రొడక్షన్స్ వారి 'శబరి'గా పండరీబాయి.

## వార్తా ప్రపంచం

మద్రాసు నగరానికి మరో క్రొత్త సినిమా థియేటర్ ఏర్పడింది. కోడంబాకంలో 'లిబర్టీ టాకీస్' పేర వెలసిన ఈ ప్రదర్శనశాలకి ప్రసిద్ధ తమిళనటుడు శ్రీ జెమినీ గణేశన్ ప్రారంభోత్సవం చేశారు. శ్రీ బి. ఐ. రెడ్డి, శ్రీ బి. వసంతకుమార రెడ్డి, శ్రీ డి. ఎం. కె. రెడ్డి అతిథులకు స్వాగతం చెప్పారు. సినీరంగంలో ప్రముఖులు చాలా మంది ఉత్సవానికి హాజరయినారు.

తరువాత 'శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం' నుంచి కొన్ని ఘట్టాలు ప్రదర్శించారు.

* * *

గతమాసం 26 వ తేదీ మద్రాసు ఫిలిం ఫాన్స్ అసోసియేషన్ వార్షికసమావేశం జరిగింది. ప్రస్తుతసంవత్సరానికి ప్రెసిడెంటుగా శ్రీమతి శివకామి సుబ్బస్వామి, గౌరవ సాధారణకార్యదర్శిగా ఆర్. ఎస్. కన్నయ్య ఎన్నికయినారు.

* * *

ఎ. వి. ఎం. వారు మరో హిందీ చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు. ఇందులో సునీల్ దత్, ఆశాపరేఖ్ నిరూపారాయ్, కృష్ణధావన్ పాల్గొంటున్నారు. నిర్మాణం త్వరిత గతిని సాగుతోంది.

* * *

ఆగస్టు 21 నుంచీ ఎడింబరోలో జరుగబోతున్న మరో అంతర్జాతీయచలనచిత్ర ఉత్సవాలకు 'అపూర్ సంసార్' చిత్రం పంపడానికి కేంద్రప్రభుత్వం నిశ్చయించింది. ఈ ఉత్సవం మూడువారాలు జరుగుతుంది. 150 చిత్రాలు ప్రపంచ మంతటనుంచి వస్తున్నాయి. నిర్మాత దర్శకుడు శ్రీ సత్యజిత్ రాయ్ ఉత్సవాలకు హాజరవుతారు.

([illegible])

# నమ్మిన బంటు

## అంతర్జాతీయ చలనచిత్ర ఉత్సవానికి ఎన్నికయిన తొలి తెలుగు చిత్రం

రాష్ట్రపతి రజతపతకం అందుకొన్న శంభూఫిలింస్ వారి 'నమ్మినబంటు' అష్టమ అంతర్జాతీయ చలన చిత్ర ఉత్సవానికి ఎన్నిక అయింది. ఈ ఉత్సవాలు స్పెయిన్‌లో శాన్ సెబాస్టియన్‌లో జులై 9 న ప్రారంభమై 19 వరకు జరుగుతాయి. జులై 16-వ తేదీని 'నమ్మినబంటు' ప్రదర్శిస్తారు.

నటులు శ్రీయుతులు ఎస్. వి. రంగారావు గుమ్మడి వెంకటేశ్వరరావు, నిర్మాత యార్లగడ్డ వెంకన్న చౌదరి, నవయుగసంస్థకు చెందిన జాగర్లమూడి లక్ష్మయ్య, కొసరాజు భానుప్రసాద్, కె. నరసయ్య ఈ ఉత్సవంలో పాల్గొనడానికి జులై 7 వ తేదీని విమానంలో స్పెయిన్ వెళ్ళారు.

అంతర్జాతీయ చలనచిత్రఉత్సవానికి తెలుగు చిత్రం పంపబడడం ఇదే మొదటిసారి.

ప్రదర్శన యోగ్యంగా ఉండడంకోసం చిత్రం నిడివి 9,500 అడుగులకు తగ్గించారు. మధ్య మధ్య స్పానిష్ భాషలో సబ్ టైటిల్స్ వ్యాఖ్యలు సమకూర్చారు. లండన్‌లో కొన్ని ఫ్రెంచి సబ్ టైటిల్సు కూర్చడానికి కూడా వీరు ప్రయత్నిస్తారు. ★

# గిరీశం లెక్చర్లు

# అయికమత్యమే బలం

## (లేక) మనవాళ్లొట్టి వెధవాయిలోయ్....

అసలీ కాలప్పొలిటీషియన్లకి ఐకమత్యపు విలువ తెలీలేదండీ వదినా. ఒక్కఘడీ సేపు ఒక్కమాటమీద నిలబడ్రు. చెరువునీటి మీదచిల్ల పెంకులాఅలాఅలామాటలమీద జరుక్కుంటూ పోతారు. అందికే గవర్నమెంట్లిలా అఘోరిస్తున్నాయి. సృష్టిలో ప్రతి వక్కటిన్నీ ఉద్ఘోషించేది ఏవిటి? అయికమత్యం కావాలోయ్‌చవ నలాయా అని. రూపాయి కాసు చూడండి. అందులో పదహారణాలూ కలిసి ఉంటేనే వాటిసత్తా. అలా సంఘటనగా కూడ బలుక్కు నిలబడతాయి. ఏదీ ఆరూపాయి నోమారు మార్చి చూడండి. ఆర్జించిన వాడు మారీమనగానే వాడి సంతంతో తల కాస్తా వంచుకు తలాదారిచా పోయినట్టు చక్కాపోతాయి. అణాకాసులు సెనగ పప్పులా చెల్లబడయిపోతాయి. అలాగేమాట వరసకి చెబుతున్నా స్మండీ. యగ్జాంపుల్ గా యవర్నో ఎందుకు గిరీశం అండ్ బుచ్చమ్మలనే తీసుకు చూడండి. వారిద్దరిమాట యాకమై వారు కలసి నిలబడితే లోకం, సంఘం, ఛాందసపెద్దలూ వారిని తేరిమాడ గలరా? ఋంతమాత్రం చూడలేరు. సంఘీభావం లేకపోతే యామవుతుంది? ఓ మంచిరోచ్చూచి అబ్బీ గిరీశం నువ్వీహా నడు అని నన్ను పొమ్మంటారు. బుచ్చమ్మ దన్ను లేని గిరీశం నిర్బలుడై, నిస్తేజుడై, రోగియై, విరాగియై చిక్కి సగమై తరవాత చచ్చిపోతాడు. అయ్యో సర్వాభమ్మడిన్ని పీకావే అని దుఃఖించడం తప్ప రొండోపనుండదు మీకు...

రా వెంకటేశం రా. వేళకొచ్చావు. యూనిటీమీద లెక్చరిస్తున్నాను. విని బాగుపడు. రేప్పిక్చర్తీసినపుడిదంతా అందులో గుప్పించేయ్యాలి. అసల్నన్నడిగితే ఈ అయికమత్యమ్మీద సినిమావాళ్ళకున్న గురిలో నూరో వంతు మనందరికీ వుంటే దేశం ఎప్పుడో బాగుపడేదోయ్. వాళ్లన్చూసి బుద్ధి తెచ్చుకోవాలి మనవంతా. వాళ్లు చూడు. అందరూ యెల్లప్పుడూ ఒకటే కథని సినిమా తీస్తారు. యీ డాదికొన్ని పిక్చర్లు చూస్తావు. యక్కడేనా ఒకదానికీ ఒకదానికీ ఒక్క అడుగులోనైనా తేడా వుందా చెప్పు. ఎందుకుంటుంది. ఉండదు. వాళ్లు బాగుపడే లక్షణం ఉన్నవాళ్లు. వాళ్లకి అయికమత్యం విలువ తెలుసు. యునైటెడ్ వుయ్‌స్టాండ్-అనగా మేమంతా ఈ విషయాల్లో కలిసి కట్టుగా ఉంటాం, ఒకటే కథ తీస్తాం, ఒక్కలాగే తీస్తాం; డివైడెడ్ వుయ్‌ఫాల్ అనగా అలాచేయక తలా వకకథా తీసుకుని తలా వకదారిచా సినిమాలు తీసినట్లయితే - వుయ్ ఫాల్-అనగా మేమంతా కూలిపోతాము అని వాళ్ళనమ్మిక. దట్, మైడియర్ వెంకటేశం, ఈజ్ ‘ఇన్‌పార్ట్’ దిసీక్రెట్ ఆఫ్ దెయర్ సక్సెస్.

వక్క కథలోనే కాదు అన్నిటావాళ్లకి ఈ అయిక్యతమీద గురివుంది. వాళ్ళకి దొరికేవి వకటోరకం పాత్రలు. అందరికీ ఆ వక్కటేరకంపాత్రలుంటాయి. అన్నిపిక్చర్లలోను. అవి వక్కటేరకం విగ్గులు (వకటో రకమే) పెట్టుకుంటాయి. ఒకటేరకం దుస్తులు ధరిస్తాయి. వకటేరకం డైలాగుల్లో, పాటల్లో ఏడుస్తాయి, ఏడిపిస్తాయి, నవ్వుతాయి, నవ్విస్తాయి, నవ్వులపాల వుతాయి. వక్కటే రకంగాపుడతాయి, పెరుగుతాయి, గిడుతాయి. అన్ని పెళ్లాలనూ వకటే కిటికీ చిల్లుల్లోంచి, వకటే రకం పాటులోచూసి వకటేరకంగా అపోహపడతాయి. వకటేరకం అవుడ్డోరులో (మహాబలిపురం, పూనమల్లి హైరోడ్డు) తిరుగుతాయి. తరవాత వకటేరకం కారు కింద పడి వకటేరకం దెబ్బ (పలాస్త్రీమార్కు) తగిలించుకుంటాయి. చివార్న అన్ని పాత్రలూ కలిసి వకటేరకంగా గ్రూపు ఫోటో తీయించుకుంటాయి - మూడోరీల్లో పోర్లను పోగొట్టుకున్న పెరుమాళ్లు (బహువచనం స్త్రీ) విచా.

మ్యూజిక్కు మాత్రం? వాళ్లీమధ్య యూనియన్ గూడా పెట్టార్ట, ఐకమత్యంలో మెలగి,-తమలో తామేగాదు డిస్ట్రిబ్యూటర్ ప్రొడ్యూసర్లతో గూడా - అందరూ ఒకటేరకం పాటల్ని ఒకటో రకంగాకాపీకొట్టడంలో ఘనవిజయంసాధిస్తున్నారు. పొడుగుచూడు. ఒక్కడుగు తభావతురానీరుగద.

వేయేల వెంకటేశం ఒక్క పొడ్డింగు మినహా మన సినిమాలలో మిగతావన్నీ ఒకటేవిధంగా ఉంటాయి. అందికే ‘వాటీజ్ ఇన్ నేమ్’న్నాడు షేక్స్పియరు. పేరులో ఏవుంది...ఏరోజ్ జిరోజ్ జరోజ్ అంకో సీమదొరసాని ఇంకో వనాలో తెలీక. అలాగే మన సినిమాలూనూ.

ఫలం చెడ్డా విఘ్నం దక్కాలన్న పట్టుదల దక్కించుకునే అయికమత్యపున్నూ మన వారిసొత్తు. అందికే బలవత్తరమైన ప్రజాభిప్రాయంగానీ, తీవ్రమైన విమర్శలు గానీ వాళ్ళు చెక్కుచెదరకుండా నిలబడి ఉన్నారు. విమర్శలు చేసేవాళ్ళట్టివెధవాయిలనుకో. గిట్టనివాళ్ళు. ఓర్వలేనివాళ్లు. ప్రజలు పాపం ఉట్టిగొర్రెల మందలుగదా... వాళ్లేమీ అన్ను; అనుకోరు. "ఇహానీ సినిమా ఇప్పట్లో బాగుపడదు. దీన్నెంజేసీ లాభం లేదు" అన్న నిస్పృహా కొదీ వదిలేశారనీ గిట్టని వాళ్ళంటారే గాని అది వుట్టిభ్రమ అని-యూ అనగా సినిమావాళ్ల - నమ్మిక.

అంగుళల్లనే మేమిట్టుపైనుంచి ఈ గిట్టని వాళ్ళనెత్తినో మొట్టికాయవేసి, ఆ విమర్శ లేవో మేమే అఘోరిస్తామని చెప్పదలచుకున్నాం. సుబ్భరంగా మా పిక్చర్లని మేమే మెచ్చుకుంటూ పత్రికల్లో విమర్శలు రాసి పారేసి అచ్చుకొట్టించేస్తాం. సీమదొరలాగే చేస్తారువ నీకు తెల్సోలేదో. కంపెనీవాడే తన తాజాపిచ్చరు మీద విమర్శరాసేయించి, అందులో నిజాయితీకి రెండు చెణుకులు గీకి-అబద్ధం, ఆపాటి లోపాలుకూడా వుండవు గాని జనవేడ్చిపోతారని లోపాలున్నట్టు భినయించడమన్నమాట - అచ్చుకొట్టి పంచిపెట్టిస్తాడు.

అవి ప్రజగాడు చదవడంటావా? లవుడు స్పీకర్లమీద చెవులు హోరెత్తిపోయేలా చదివేస్తాం. వూరూరా అహోరాత్రాలూ టముకేయించేస్తాం...అప్పటికీ జనం నమ్మక హాలువేపు రాపోతే, మేమే టిక్కెట్లుకొనేసుకుళ్ళి మరోమారు చూస్తొక్కవస్తాం. బాగుందండోయ్ అని పొగుడువాడికి చెప్పి పొగుడపెడతాం. మేచరిగిన మినిష్టర్ల చేత ఒపినియన్సు ఇప్పించి అతిపెడతాం. అసలిందాకా రాదులే. మనవాళ్లొట్టి గొర్రెలమందలు. వాళ్లకీ తభావతు లన్నీ తెలిస్తాయా యేవిటి.

సో మై డియర్ వెంకటేశం. నేను ప్రొడక్షన్‌కేగాక రిలీజుకీ, పబ్లిసిటీకీ, అనుకూల విమర్శకీ, జనానికీ కూడా ఏర్పాట్లు చేసేశాను. నీదీ, మీ సిమర్తీ మాత్రమే ఆలీసెం. రిమెంబర్ యునైటెడ్ వుయ్ ఫాల్. మనవంతా కలిసి కట్టుగా ఊబిలో పడదాం; డివైడెడ్, వుయ్ స్టాండ్-పడి లేచాక, విడివిడిగా నిలబడదాం—నా అంత గొప్పవాణ్ణి నేనేనన్నీ అని.



# ఉత్తరాలు

(2-వ పేజీ తరువాయి)

ప్రశ్నకు జవాబుగా "నన్నయ" అని తెలియజేశారు. నన్నయగారు వ్రాసినది "భారతం" కాని "రామాయణం" కాదుగదా!

అలాంటప్పుడు మీ సమాధానం ఎలా సమర్థిస్తారో వివరింపకోర్తాను – అదే విధంగా "దేశభాషలందు తెలుగు లెస్స" అన్న పద్య పాదము "తెలుంగదేల యన్న దేశంబు తెలుగేను తెలుగు విభుడ..." అన్న ఆముక్తమాల్యద గ్రంథకర్త శ్రీకృష్ణదేవరాయలది కాదా!

సి. కామేశ్వరరావు (గూడూరు).


















* నన్నయ ఆంధ్రమహాభారతంలో అరణ్యపర్వంలో రామాయణ గాథ తెలిపారు.

రాయల పూర్వీకుడైన శ్రీనాథుడు 'హర విలాసం'లో "...జనని సంస్కృతంబు సకల భాషలకును దేశభాషలందు తెలుగు లెస్స" అన్నారు.

* * *

సాహిత్యంలో కొద్దిపాటి పరిచయం ఉన్నదని ఇన్నాళ్ళూ నాలోనేను అనుకొని తృప్తిచెందెడి వాడను.

తీరా మీ ప్రశ్నలకు పావు గంటలో సమాధానములు వ్రాసి రిజల్టు చూసుకొనేటప్పటికి 12 మార్కులు కన్నా ఎక్కువ రాలేదు. ఇందుమూలంగా మంచి గుణపాఠము నేర్చుకో గలిగినాను.

ఇదేవిధముగా తరచు చదువరులకు సాహిత్య ప్రశ్నావళి అందించి వారివారి మదింపును తెలుసుకొనుటకు ఉపకరించే విధముగా మీ పత్రికలో ప్రకటించ గోరుచున్నాను.

వ్యాసకర్తకు ధన్యవాదములు.

సురేంద్ర సింగ్ (నెల్లూరు)

* * *

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ఆంధ్ర రాష్ట్రేతర సోదరులకు అనేక వందల మైళ్ళ దూరములో ఉన్న మాతృదేశ, భాషలకు సన్నిహితత్వం కలుగచేస్తూంది.

ముఖ్యంగా "మీ సాహిత్య పరిచయం ఎంత?" అనే శీర్షిక వారివారి యోగ్యతలను నిర్ణయించడమే కాక మాటు మణిగి, చీకటిండ్లలో పాతుకుపోయిన విజ్ఞానాన్ని వెలికి వికసింపజేస్తోంది.

కె. అరవిందకుమార్.
(అప్పాజీ బిలాస్పూర్.)

## తెలుగు వెలుగులు

'తెలుగు వెలుగు'ల్లో గొట్టిపాటి బ్రహ్మయ్యగారినిగురించి వ్రాసిన విషయాలు చాలా బాగున్నాయి. "గురువులను కాదని తన దోవన తానుపోయి ఉంటే ఆయన భిన్నంగానే ఉండేవారు" అని మీరు వ్రాసిన విషయం ముమ్మాటికీ నిజం.

వి. జస్వంత్.
(విజయవాడ.)

* * *

శ్రీ ఈమని శంకరశాస్త్రి గారిని గురించి (6-9-60) వ్రాసిన విమర్శ ఎంతో ఆనందాన్ని, గర్వాన్ని (మా ప్రాంతపు వారగుట వల్ల) కలిగించింది. గాండీవ నాదముతో పోలిక చాలా బాగున్నది. వారి తంత్రీనాదమునుండి వెలువడే రాగ ప్రసారాదికములను తలచుకొని పరవశుడనైన నేను మీకు, శ్రీ శాస్త్రిగారికి ధన్యవాదము లర్పిస్తున్నాను.

మీ వ్యాఖ్య కేవలము వెలుగులవ్వ చీకటి

వలదనేవారికి ఉత్సాహము కలిగిస్తుంది.

కండికోట గంగారామశాస్త్రి
(వెంకటాయ పాలెం, ప్రొద్దుటూరు).

* * *

'తెలుగు వెలుగులు' లో ఇటీవల శ్రీ వి. వి. గిరిగార్ని గూర్చి వ్రాసినదానిలో 'న్యాయం చేకూర్చ లేదని వ్రాయవలసి వస్తోంది.

కనిపారథి విశ్వనాధ శర్మ
(కొవ్వూరు.)

## పొట్టి కథలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికయందు చివరి పేజీలో ఉంటూన్న హాస్యపు మాటలకు "పొట్టి కథలు" అను నామకరణం పెట్టుట బాగుగలేదు. వాటికి సాధ్యమైనంతవరకు, తోచినంతవరకు మంచిపేరు పెట్టాలని కోరుచున్నాను.

యం. టి. ఆర్. (శ్రీరాం నగర్).

## జీవనగంగ

జీవనగంగ చాలా బాగుంది. శ్రీ పురాణం సూర్యప్రకాశరావు గార్కి నమస్కారములు. రాధపాత్ర చాలాబాగుంది. ప్రకాశరావు అన్నయ్యగార్కి అభినందనలు.

కె. మణిమాల (సెల్లిమర్ల).

* * *

## కార్టూన్

6-7-60 పత్రికలో ప్రచురించిన "మగవారు రాకుండా చూడవే!" అను కార్టూన్ చాలా బాగుంది. ఇంతమంచి కార్టూన్ వేసిన ఎస్. శివవర ప్రసాద్ (విశాఖపట్టణం)గారికి నా హృదయ పూర్వక వందనాలు.

ఆర్. అప్పారావు (పిఠాపురం).

## 10-వ గళ్లనుడికట్టుకు జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 రా | మా | 2 య | ణ | 3 ము | ■ | 4 ర | ఘు | 5 వం | శ | 6 ము |
| జే | ■ | క్ష్మి | ■ | 7 త | క్షు | వ | ■ | గ | ■ | ళ్ళ |
| 8 వ | రి | ■ | 9 పో | క | ■ | 10 ము | 11 ని | ■ | 12 ద | కం |
| ము | ■ | ■ | లి | ■ | ■ | ■ | ద | ■ | ■ | చె |
| ■ | 13 వా | డు | క | ■ | ■ | 14 వే | ప | డ | 15 ము | ■ |
| 16 కా | కి | ■ | ■ | 17 గీ | త | లు | ■ | ■ | 18 లు | ప |
| ■ | 19 లి | ఖి | 20 త | ము | ■ | ■ | 21 చె | రు | కు | ■ |
| 22 కొ | ■ | ■ | ను | ■ | ■ | ■ | లి | ■ | ■ | 23 భా |
| 24 ర | వి | ■ | 25 వృ | 26 షా | ■ | 27 నే | మి | ■ | 28 అ | ర |
| డ | ■ | 29 స్పే | ■ | 30 త | జా | ర | ■ | 31 ఆ | ■ | త |
| 32 వి | ని | మ | య | ము | ■ | 33 ము | దా | వ | హా | ము |

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్ళనుడికట్టు-11

## ఆధారాలు

అడ్డము

3 శ్రీకృష్ణుని ఉద్యానవనము.

8. ఆంధ్రదేశంలోని పెద్దనది.

*9. ఈ కాలమే!

10. మంచిగుణిని సూచించేవ్రతం!

11. పాకంతో సంబంధం ఉన్న కాల వర్ణం

12 ఏమిటో రాకపోతే మౌనం.

14 మునుపటివాడు.

15. పెద్దవాడు.

17. అమ్మకు దీర్ఘమిచ్చి వక్రం చెయ్యండి.

18: కలగాపులగమయిన ప్రాణి.

19 మళ్ళీ కలగాపులగమైన మాట: ఈ మాటు 'ఆగు' అని అర్థం వస్తుంది!

20 తిరగబడిన కాలు. ×

22 కొత్తని దీర్ఘంచేసి నీటిమీద చూడండి.

23. కాంతి.

24 పొలంలో పచ్చగా కనిపించే దాంట్లో ఆధారం!

25. రాగి, కంచు వంటిది.

26. తల్లక్రిందులయిన కొండచరియ.

27. మేకకు గడ్డి కూడా పోడుచు కుంటుంది.

28. ఈ కూడా అంటే కిటికీలో ఉంటుంది.

29. చెట్టు.

30. పాతము మధ్య దీర్ఘం చేరిస్తే సమూహం.

32. చెయ్యకలను, అంటే త్రాడు కోసం వెతకవలసివస్తుంది.



34. కలగాపులగమైన పోట్లాట, కోర్టులోకి ఎక్కితే!

35. మారయినా, వందయినా దాని మాత్రం మరచిపోకండి!

36. నిర్ణీత కాలం, తిరగబడి పోయింది.

38. దాహం.

39. ఏదైనా తేలకపోతే జరిగేది.

42. పక్షి ఎగరడం చాలించి, సూర్యవంశానికి చెందుతుంది.

## ఆధారాల పోటీ

ఈ గడికట్టులో 2 నిలువుమాటకు, 9 అడ్డం మాటకు మేము ఇచ్చిన ఆధారాలకన్న ఉత్తమమైనవి పంపేవారికి పది రూ॥ బహుమతి ఇస్తాము. ఆధారాలు మాకు చేరవలసిన ఆఖరితేదీ జూలై 28, 1960.

43. సూర్య (కిరణం)

45. చెక్కరింతను తలక్రిందులుగా పూర్తి చెయ్యండి!

46. పగతురగమనములోని అశ్వము.

47. చెప్పుకునే మాటలు, కాని విన్నట్లు ఉంటాయి!

## నిలువు

1. మనం ఉండే బంతి!

*2. తెర.

4. అనార్కలి!

5. రెండుసార్లు నడుములను చేర్చండి, మాటకోసం.

6. మూకలు మధ్య లి చేర్చితే వ్రేళ్ళు వస్తాయి.

7. లోపాన్ని కలంతో అక్షరం చేర్చి ఈ విధంగా మార్చి వ్రాయవచ్చు.

12. టోకియోకు మొత్తం రావాలి.

13. తామరపువ్వువంటి కన్నులు కలవాడు.

15. శ్రీకృష్ణదేవరాయల రాజ్యము ఈవిధంగా వర్ణించవచ్చు.

16. నోక్కి దీపాన్ని వెలిగించడానికి వాడండి!

17. రాకని వెళ్ళు మనకుండా ఉండము!

21. గట్టిశిల.

31. అరకావు కాగితంలో మిగిలిన చోటు.

33. సముద్రంలో నవనీతాన్ని చిలికి తీశారుట! (ఆకాశంలో కనిపించేదే కాని పైన ఇచ్చిన వర్ణనను జాగ్రత్తగా పరిశీలించండి!)

34. గడికట్టులో ఈ శాస్త్రాన్ని సరిగా పాటించడం అరుదే– దీనికి యుద్ధంలో కొంచెం సంబంధం ఉన్నట్లు కనుపిస్తుంది!

35. ధాన్యంలో కనుపిస్తే దీర్ఘం చెయ్యండి! కావలసినది వస్తుంది.*

37. కంఠంలో విషముకాని, విషములో కంఠమా?

40. పట్టణము.

41. కానిపాలిటి—

44. నూనె.

## గళ్ళనుడికట్టు–9

### ఆధారాల పోటీ ఫలితం

శ్రీ ఎస్. వి. విశ్వేశ్వరశర్మ (విజయవాడ) పంపిన ఆధారాలు ఉత్తమమైనవిగా నిర్ణయించి ఆయనకు బహుమతిగా రు. 5 లు పంపుతున్నాము.

శ్రీ విశ్వేశ్వరశర్మ పంపిన ఆధారాలు ఇవి:

29 అడ్డము. ప్రేమతో ముడిపడి స్నేహంగా మారింది. (మేము ఇచ్చినది-స్నేహము.) జవాబు-ప్రేముడి.

22 నిలువు. పాయసముద్రములో తియ్యగా ఉండేది. (మేము ఇచ్చినది-పరమాన్నం.) జవాబు-పాయసము.

—సంపాదకుడు.



చిత్రకారుడు—శ్రీ గిరికొట్టి అచ్యుతరావు (పుల్లేటికురు)

# పొట్టి కథలు

నేను, నా స్నేహితుడు మా ఊరికి దగ్గరలో ఉన్న తోటకు సాయంత్రము ఒక బిస్కత్తుల పొట్లము తీసుకొని, బయలు దేరాము. అలా తోటలోకి వెళ్లి మామిడి చెట్టు క్రింద కూర్చొని పొట్లము విప్పాము. అందులో మాకు తగ్గట్టు ఏడు బిస్కత్తులు ఉన్నాయి. కాని ఎలా పంపకము పంచుకోవడము? "ఒరేయ్! నేను బిస్కత్తులు తెచ్చాను. కనుక నా కొకటి ఎక్కువ" అన్నాడు నా స్నేహితుడు. నేను "అలా వరిపడదురా, తలా మూడు తీసికొన్న ఒకటి మిగులును, దానిలో చెరిసగము తీసికొందము" అన్నా. మా వాడు అలా కూడదన్నాడు. ఇద్దరు కొంత సేపు తగవు లాడుకొన్నాము. "ఈ దెబ్బలాటతో మన తగవు తీరదు కనుక పందెము వేసికొందము" అన్నా. దానికి ఒప్పుకొన్నాడు. ఎలాగైనా నా వానిని ఓడించాలనే ధీమాతో కఠినమైన పందెం ఏదో అని ఆలోచించి ఆఖరికి పందెం వేసికొన్నాము "మనమిద్దరము కళ్లు మూసుకొని 'జో జో జో' అంటూ కూర్చుందాము. ఎవరు అలా అనక త్వరగా ఆపుతారో వారు ఓడిపోయినట్లు" అని కళ్లు మూసికొని "జోజోజో" అంటూ కూర్చున్నాము.

కొంత సేపు అయిన తరువాత నాకు అనుమానం వేసి కళ్లు తెరిచి చూశాను కదా, ఇంకేముంది బిస్కత్తులు అక్కడ లేవు. తోక చప్పరిస్తూ నవ్వుముఖముతో మాముందు ఒక కుక్క ఉన్నది.

—పి. లక్ష్మారెడ్డి. (బంటనపోల్)

* * *

నేను ఇంటరు జూనియర్ చదువుచున్న కాలేజిలో మాకు ఒక తెలుగు లెక్చరరుగా రుండే వారు. ఆయనంటే మా క్లాసులో ఎవరికీ మర్యాద ఉండేది కాదు. ఎప్పుడూ ఆయన క్లాసులో అల్లరి చేస్తూండే వాళ్ళము. ఒకరోజున ఆయన ఒక పాఠము చెప్తూ ఉదాహరణ మొకటి చెప్పారు. అదేమంటే, "ఒక ఊళ్లో ఒక పిచ్చి కుక్క ఉండేదిట. అది అందరినీ కరిచివేస్తుండేదిట. అదివస్తున్నదని తెలియుటకొరకై దాని మెడలో ఒకగంట కట్టారుట." ఇట్లు మా లెక్చరరుగారు చెప్తూ ఉంటే మా విద్యార్థులలోని ఒక ఆకతాయి "కాయ్, కాయ్" అని మధ్యనుండి ఎవరో తెలియకుండా అన్నాడు. మా లెక్చరరుగారికి మొదట కోపం వచ్చినా సముదాయించుకొని, వెంటనే చమత్కారముగా "ఆ పిచ్చి కుక్క ఎప్పుడూ కాయ్, కాయ్ అని అంటుండేది" అని ఉదాహరణను సమర్థించారు మా క్లాసులోని వారంతా పకపకా నవ్వేశారు.

—"యతి" (పూనా)

Printed and Published for NageswaraRac Estates (Private) Ltd, by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambi Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad